*RECAP:* RAM AND SHYAM RESCUE AN ALIEN - ZARTOGAARR, WHEN HIS SPACESHIP CRASHES TO EARTH. IN RETURN HE GIFTS THEM THE *DEKATRIX, A POWERFUL GADGET* WITH *10 POWERS.*

EACH POWER CAN BE UNLOCKED BY EATING THEIR FAVOURITE POPPINS. 10 POWERS: *SHAPE SHIFTER*- GREEN APPLE, *SPEED*-MANGO, *FLIGHT*-ORANGE, *GIANT*-WATERMELON, *STRENGTH*- RASPBERRY, *SHRINK*-LYCHEE, *INVISIBLE*-PINEAPPLE, *STRETCH*-MUSK MELON, *FISSION*-BLACK CURRANT, *FORCE FIELD*-GUAVA.





























అభియానం లో రాజు




# యువ విజేతలు

## ఆర్య అరవింద్ దతార్

**ఇష్టాలు:**

- నచ్చిన సినిమా - తారే జమీన్ పర్
- అభిరుచులు - పేకాట ఆడటం
- రోల్ మోడల్ - టెన్నిస్‌లో నాదల్
- ఇష్టమైన సబ్జెక్ట్ - మరాఠీ
- రేపటి ఆశ - లాన్ టెన్నిస్ ఛాంపియన్

**సాధించిన విజయాలు:**

- స్వర్ణ (కుమిటె) రజత (కాటా) పతకాలు-ముంబై మేయర్ కప్ 2009లో.
- రజత పతకం - నేషనల్ ఇన్విటేషన్ టోర్నమెంట్ ముంబై 2009లో.
- స్వర్ణపతకం - షోటోకన్ కరాటే అకాడెమీ నేషనల్ టోర్నమెంట్ ముంబై, 2010లో.

ఈ నెల ముంబై కరాటే బుడత ఆర్య అరవింద్ దతార్‌ను కలుసుకుందాం! ఎకె జోషి ఇంగ్లీష్ స్కూల్‌లో ఏడవ తరగతి చదువుతున్న ఈ బాలిక మూడన్నర సంవత్సరాల వయస్సు నుండే కరాటే ప్రాక్టీస్ మొదలెట్టిందట! నగరంలోని షోటోకన్ కరాటే అకాడమీలో ఆర్య శిక్షణ పొందుతోంది. కాస్సేపు వ్యాయామం తర్వాత ఆమె కోచ్ సెన్సీ అనిల్ పటేల్ షోటోకన్ కరాటేలోని కుమిటె మరియు కాటా ఆట శైలులను బోధిస్తాడు.

‘‘నా చెల్లెలు నుంచి యోగా కూడా నేర్చుకుంటున్నాను. ఆత్మ రక్షణ జీవితంలో చాలా ప్రధానమైనది’’ అని ఆర్య ఈ సందర్భంగా వ్యాఖ్యానించింది.

ఆమె ఇప్పటికే బ్రౌన్ బెల్ట్ సాధించింది. బ్లాక్ బెల్ట్ పరీక్షల్లోనూ పాల్గొంది. కరాటే క్లాసులు సాయంత్రం వేళ జరుగుతున్నందున ఆమె చదువులకు అవి అడ్డు కాలేదు.

కముటె శైలిలో అతి త్వరలోనే స్వర్ణ పతకం గెలవాలన్నది ఆర్య బలీయమైన ఆకాంక్ష!



హంగరీలో జరిగిన కరాటే ఛాంపియన్‌షిప్ పోటీలు ఆమె ఎదుర్కొన్న అతి సంక్లిష్ట టోర్నీలలో ఒకటి. అయితే పెరిగి పెద్దయ్యాక మాత్రం లాన్ టెన్నిస్‌లో ఛాంపియన్ కావాలని ఆమె కోరుకుంటోంది.

చిన్నారి ఆర్యకు నీకు చందమామ శుభాకాంక్షలు!

# ఈ సంచికలో...



చందమామ    సంపుటి: 63    నవంబర్ 2010    సంచిక: 11



**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.



T

ప్రియమైన స్నేహితులారా!

దీపావళి పండుగను ఆనందోత్సాహాలతో జరుపుకుని ఆస్వాదించడానికి మీరు సిద్ధంగా ఉన్నారు కదూ! పండుగ సందర్భంగా శబ్ద కాలుష్యాన్ని పెంచవద్దని అభ్యర్థిస్తున్నాము. అదే సమయంలో దీపావళి పర్వదినాన్ని మీరు ఆహ్లాదకరంగా జరుపుకోవాలని కోరుకుంటున్నాము. దీపావళిపై మీ అనుభవాలను రాసి మాకు పంపండి. పండుగపై మీ ఆలోచనలకు రంగులద్ది మీరు గీసిన వర్ణ చిత్రాలను, పెయింటింగులను మాకు పంపగలరు. వాటిని రాబోయే నెలల్లో చందమామలో ప్రచురించగలం.

నవంబర్ 9 ప్రపంచ ఆవిష్కర్తల దినం. ఆ రోజు ప్రముఖ ఆవిష్కర్త, హాలీవుడ్ నటి హెడీ లామర్ జన్మదినం. నటిగా ఈమె సుప్రసిద్ధురాలు, సంపన్నురాలు. కాని ఆమె ప్రపంచానికి అందించిన ఒక ఆలోచన/ఆవిష్కరణ ఆమెకు శాశ్వత కీర్తి కల్పించింది. ఫ్రీక్వెన్సీ హాప్పింగ్ (పౌనఃపున్య లంఘనం) అనే ఆమె ఆవిష్కరణను ఈ నాటికీ మన మొబైల్ ఫోన్‌లలో ఉపయోగిస్తున్నారు. ఇలాంటి ప్రముఖులనుంచి మనం స్ఫూర్తి పొందాలి. మనలో ప్రతి ఒక్కరిలో, మార్గ నిర్దేశం చేయగల ఆలోచనలు కలిగిన ఆవిష్కర్తలు ఉన్నారు. మనం చేయవలసిందల్లా అలాంటి ఆలోచనలకు ఒక రూపం కల్పించి ఎన్ని ఇబ్బందులు ఎదుర్కోవలసి వచ్చినా సరే వాటికి పెంచి పోషించవలసి ఉంది.

మన ప్రథమ ప్రధానమంత్రి చాచా నెహ్రూ నవంబర్ 14న పుట్టారు. పిల్లల పట్ల ఆయనకున్న ప్రేమ ప్రపంచానికి తెలుసు. పిల్లల పట్ల ఈ ప్రేమ భావాన్ని మనందరం అనుసరించాలి. మనం పొందవలసిన స్ఫూర్తిని ఆయనలో చూడాలి. మనం ముందుకెళ్లడానికి, చిన్న, పెద్ద సమస్యలను ఎదుర్కోవడానికి ఈ స్ఫూర్తే మనకు శక్తిని ప్రసాదిస్తుంది.

ఐక్యరాజ్యసమితి నవంబర్ 20ని అంతర్జాతీయ బాలల దినంగా గుర్తించిందని మీకు తెలుసు కదూ?

చందమామ సంచికలోని పలు విభాగాలపై మీ అభిప్రాయం మాకు కావాలి. అప్పుడే మేం పత్రికను మరింతగా మెరుగుపర్చగలం. మీ ఉత్తరాలను మాకు పోస్టు ద్వారా పంపండి. అలాగే editor@chandamama.com చిరునామాకు కూడా మీరు ఈమెయిల్ పంపగలరు.

చందమామ పాఠకులు, అభిమానులందరికీ దీపావళి శుభాకాంక్షలు. – సంపాదకులు




నవంబర్ 2010 Rs. 20/-
*Founded by* B. Nagi Reddi and Chakrapani

**Editor & Publisher :**
Prashant Mulekar

**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju

**Sub Editor :**
Patricia Pandian

**Content Head - Online :**
Sowmya Bharadwaj

**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar

**Artist :**
Venki

**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar

**Production In-charge :**
Prashant Pawar

**Circulation:**
circulation@chandamama.com

**Head - Sales and Circulation:**
Sanjay B Thorat

**Manager - Sales & Circulation (West & North):**
Vinay K Brid

**Asst. Manager - Sales & Circulation (East):**
Subhankar Rej

**Sales Officer - Circulation:**
K. Ravishankar

**Advertisement :**
sales@chandamama.com

**Subscription:**
Subscription@chandamama.com

Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828

**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Printed and Published by Prashant Mulekar at Shruti Art Pvt. Ltd., Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai - 400 010 on behalf of Chandamama India Limited, B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.
Editor : Prashant Mulekar

# పాఠకుల లేఖలు



ప్రాంతీయ చందమామ సైజు తగ్గించడం అభినందనీయం కాదు. చందమామ ఇప్పటికే దాదాపుగా పాకెట్ బుక్ అయిపోయింది. చందమామ బ్రిటిష్ లేదా ఫ్రెంచ్ చందమామలా కాక భారతీయ చందమామలా ఉండాలని ఆశ. మీరు మిమ్మల్ని పొగిడే ఉత్తరాలు మాత్రమే ప్రచురించి సంతృప్తి చెందుతున్నట్లుంది. – సూరం సాయినాథ్, హైదరాబాద్, ఎపి

చందమామ ఆగస్ట్ సంచిక చూశాక, ''జనం కోరేది మనం చెయ్యడమా, మనం చేసేది జనం చూడటమా'' అనే పాతాళభైరవి సినిమా డైలాగు గుర్తొస్తోంది. చందమామ కొత్త సైజుకు జనామోదం లభించదు. కాగితం కొరత గురించి మీసమస్యలు చెప్పినప్పటికీ దశాబ్దాలుగా మమ్మల్ని మంత్రముగ్ధులను చేస్తూ వచ్చిన చందమామ ఇలా పాకెట్ సైజ్ బుక్‌గా మారిపోవడం దిగ్భ్రాంతి కలిగిస్తోంది. – డాక్టర్ వి.వి. రమణ, హైదరాబాద్

ఆగస్ట్ చందమామను చూశాక అది మన చందమామేనా అని అనుమానం వచ్చింది. వెడల్పు తగ్గి పొడుగ్గా ఉంది. నిజంగా ఇది చిన్నబోయిన చందమామే. ఇంటికి రాగానే 1953 నుంచి ఉన్న నా పాత చందమామలను చేతుల్లోకి తీసుకొని తృప్తి చెందాను. శిధిలాలయం సీరియల్‌కి రచయితగా 'చందమామ' పేరు కాకుండా దాసరి సుబ్రహ్మణ్యం అని వేయడం ఒక్కటే నాకు నచ్చింది. వార్తల బట్టి చూస్తే ఆకాశంలోని చందమామే తరిగిపోతున్నాడట. – అప్పారావు మట్టెగుంట, రాజమండ్రి

మీ అభిప్రాయాలను ఈమెయిల్
feedback@chandamama.com
ద్వారా పంపవచ్చు.



**Visit us at : http://telugu.chandamama.com**



# తిక్కరాజు పాలన

కల్లోల రాజ్యాన్ని పాలించే తిక్కరాజుకి తన పాలన గూర్చి ప్రజలు ఏమనుకుంటున్నారో తెలుసుకోవాలనుకున్న కోరిక కలిగింది. కోరిక కలగడమే ఆలస్యం. ఆ సాయంత్రమే మారువేషంలో నగరంలో పర్యటించడానికి బయలు దేరాడు.

బాగా చీకటిపడేవరకు తిరిగినా, ప్రజలెవరూ తన గూర్చి ఏమీ మాట్లాడుకోక పోవడంతో కొద్దిగా నిరాశ చెంది సత్రం వద్దకు చేరుకున్నాడు. ఆ రాత్రికి సత్రంలోనే బస చెయ్యాలని నిశ్చయించుకుని ఒక మూల నడుం వాల్చాడు.

ఇంతలో పక్కగదిలో ఇద్దరు ఆసాముల సంభాషణ అతని చెవిన పడింది. మొదటి వ్యక్తి రెండో వానితో, ''మన మహారాజు గారు నిజంగా ధర్మ ప్రభువులే కదూ...?'' అన్నాడు.

దానికి రెండోవాడు, ''అవునవును..... దాన ధర్మాల్లోనే కాదు. వీరత్వ శూరత్వంలో కూడా ఆయన్ని మించిన వాడు ఈ చుట్టుపక్కల రాజ్యాల్లోనే లేడు...'' అన్నాడు.

మళ్లీ మొదటి వాడు అందుకుని ''మన పొరుగురాజ్యంలో కూడా లేడు...'' అన్నాడు. ''పొరుగు రాజా? వాడో తెలివితక్కువ దద్దమ్మ...'' అన్నాడు రెండోవాడు.

వాళ్ల సంభాషణ రహస్యంగా విన్న తిక్కరాజు వాళ్లిద్దరూ తననే పొగడుతున్నారని భావించి, పరవశంతో అంతఃపురం కేసి దారి తీశాడు.

కానీ, ఆ సాములిద్దరూ పొరుగు రాజ్యానికి చెందిన వర్తకులు. బాగా చీకటి పడటంతో తిరిగి వెళ్లలేక సత్రంలో బస చేశారు. వాళ్ళు అంతవరకూ పొగిడింది వాళ్లు రాజుననీ, తెలివి తక్కువ దద్దమ్మగా జమ కట్టింది తిక్కరాజు నేననీ అతనికి తెలియలేదు పాపం!

– మల్లారెడ్డి మురళీ మోహన్





# షావుకారు విరాళం

షావుకారు శివయ్యకు బాగా జబ్బు చేసింది. ఆయన వైద్యుడితో, ''ఈ మాయదారి జబ్బువల్ల శరీర బాధతో పాటు, బుద్ధికి కూడా నిలకడ లేకుండా పోతున్నది. దీంతో చెప్పవలసింది చెప్పలేక పోతున్నాను; చెప్పకూడదనుకున్నది చెప్పేస్తున్నాను!'' అన్నాడు.

''నిరాశపడకండి! నా శక్తి కొద్దీ ప్రయత్నించి, మీ జబ్బు కుదురుస్తాను,'' అన్నాడు వైద్యుడు.

''నిజంగానా? అలా చేశారంటే, మీ వైద్యశాలకు లక్ష రూపాయలు విరాళ మిస్తాను,'' అన్నాడు షావుకారు.

కొన్నాళ్ళ వైద్యం తర్వాత షావుకారు జబ్బు నయమైపోయింది. ఒకరోజున వైద్యుడు ఆయనను చూడవచ్చి, ''మీకోక సంగతి గుర్తుచేయదలిచాను. మీరు జబ్బులో ఉండగా నా వైద్యశాలకు లక్షరూపాయలకు విరాళమిస్తానన్నారు,'' అన్నాడు.

''నిజమా? అసలు జబ్బే అది. చెప్పవలసింది చెప్పలేకపోవడం; చెప్పకూడనిది చెప్పేయడం!'' అన్నాడు షావుకారు.

– రావుల పాటి ప్రసాద్

# మంచిపని

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్లి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు...

''రాజా నీవు ఈ అపరాత్రి వేళ స్వార్థం కొద్దీ ఏదైనా అపూర్వ వస్తువును సంపాదించాలనుకుని ఇంత శ్రమ పడుతున్నావా? ఇది నీ స్వంత లాభం కొరకైతే నీకు ఫలం దక్కదు. నిస్వార్థమైతే తప్పక ఫలం దక్కుతుంది. ఇందుకు ఉదాహరణంగా ''మంచి పని'' అనే ఒక కథను చెబుతాను. శ్రమ తెలియకుండా విను'' అంటూ ఇలా చెప్పసాగాడు.

పూర్వం శిల్లంగేరి దేశంలోని ఒక పల్లె గ్రామంలో ధర్మపాలుడనే ఒక ధనికుడు ఉండేవాడు. అతడు ఒకరికి దాన ధర్మం కానీ, సహాయం కానీ, చేసి ఎరుగడు. అతనంతటి పిసినారి ఆ గ్రామంలో మరొకడు లేడు.



ఒక రోజు ధర్మపాలుని ఇంటికి ఒక సన్యాసి వచ్చి బిక్షం అడిగాడు. యధా ప్రకారం ధర్మపాలుడు అతడిని కసిరికొట్టి వెళ్ళిపొమ్మన్నాడు. ఆ సన్యాసి వెళ్లిపోతూ, ''నీ ఖర్మ అలా ఉంది! నీ ఇంట్లో మీ పెద్దలు దాచిన ధనరాశి, నీలో మంచి గుణం లేనందున నీకు దక్కలేదు,'' అంటూ వెళ్లిపోయాడు.

ఆ మాటలు విన్న ధర్మపాలుడు ఎక్కడలేని దురాశ పుట్టింది. అతను ఆ సన్యాసిని వెంబడించి క్షమాపణ కోరి బ్రతిమాలి తన ఇంటికి పిలుచుకుని వచ్చి సత్కరించాడు. తన ముత్తాతలు దాచిన గుప్త ధనం ఆ చూకి చెప్పమని కాళ్లూ చేతులూ పట్టుకుని బ్రతిమాలాడు.

సన్యాసి ఆ గుప్త ధనరాశి ఉన్న చోటు చూపించి, ''ఈ గుప్త ధనరాశి నీకు లభించాలంటే నీవు కనీసం ఒక మంచి పని చేయాలి. లేకపోతే ఆ ధనరాశి నీ స్పర్శ పడగానే సర్పంగా మారుతుంది జాగ్రత్త!'' అని చెప్పి వెళ్లిపోయాడు. వెళ్లుతూ తన ఆశ్రమ ఆచూకి చెప్పాడు.

ధర్మపాలుడికి ఏ మంచి పని చెయ్యాలో తోచలేదు. భార్యను సలహా అడిగాడు. ఆమె ''మీరెన్నడూ దేవాలయానికి వెళ్ళి దేవుడికి దండం పెట్టిన పాపాన పోలేదు. ఆ పని చేయండి,'' అని సలహా ఇచ్చింది.

మరుసటి రోజే ధర్మపాలుడు తెల్లవారక ముందే లేచి స్నానం చేసి దేవాలయానికి వెళ్లి వచ్చాడు. కొబ్బరి కాయ కూడా కొట్టాడు. గుప్త ధనం తప్పక తనను చేరేటట్టు ప్రసాదించమని దేవుడిని కోరాడు.

తర్వాత అతడు ఇంటి తలుపులు మూసి సన్యాసి చూపిన చోట తవ్వాడు. కాస్సేపయ్యాక అక్కడ కొన్ని పాత్రలు వాటినిండుగా బంగారు నాణేలు, ఆభరణాలు కనిపించాయి. వాటి విలువ తనకున్న ఆస్తి కంటే ఎన్నో రెట్లు అధికం అని అంచనా వేశాడు. సంతోషంతో అతడి మనసు కుబకుబలాడింది. ఒక పాత్రను ఎత్తబోయాడు. అయితే అతడి చేయి ఒక పాత్రను తాకగానే ఒక పెద్ద నాగసర్పం ఎక్కడి నుండో వచ్చి పాత్ర పైన కూర్చుంది. ధర్మపాలుడు పాత్రను ఆ గుంతలోకే వదిలి పెట్టాడు. దాంతో పాము మాయమై పోయింది.

ధర్మపాలుడు వెంటనే సన్యాసి వద్దకు వెళ్లి జరిగిన సంగతి చెప్పాడు. అప్పుడు సన్యాసి, ''ధర్మపాలా నీవు చేసిన మంచి

పని చాలదు. అందుకే ఆ నిధి నీకు దక్కలేదు. ఈ సారి మరింత గొప్ప పని చేసి చూడు,'' అని చెప్పి పంపించేశాడు.

ఇంటికి వెళ్ళి మరల తన భార్యను సలహా అడిగాడు. ''ఆమె, దేవాలయానికి వెళ్ళి దేవుడికి దండం పెట్టి రావడమే కాకుండా అర్చనలు, పెద్దపెద్ద సేవలూ చేసి ఆనక చూడు,'' అని చెప్పింది.

ధర్మపాలుడు అలాగే ఒక వారం రోజులు చేసి గుప్తధన పాత్రను ముట్టు కున్నాడు. మరలా చెయ్యి సోకేటప్పటికి నిధి పెట్టె పైకి మళ్ళీ సర్పం వచ్చి తిష్ట వేసింది.

ధర్మపాలుడు మళ్ళీ సన్యాసి వద్దకు వెళ్ళి జరిగింది చెప్పాడు. సన్యాసి ''నీవు మరల చేసిన మంచిపనులతో దైవం తృప్తి చెంద లేదేమో. మరో గొప్ప పని చేసి ప్రయ త్నించు నాయనా, నిస్పృహ చెంద వద్దు,'' అని చెప్పి పంపాడు.

ధర్మపాలుడు యధాప్రకారం మరలా భార్య సలహా అడిగాడు. ఆమె, ''సన్యాసి చెప్పింది నిజం. దేవుడు మీ సేవలతో సంతృప్తి చెందినట్లు కనిపించడం లేదు. గుప్తనిధి మన స్వాధీనం కావాలంటే మనం దేవుడికోసం మరింతగా ఖర్చు పెట్టవలసి ఉంది. గుడికి చలవరాళ్ళతో తాపడం చేయించు. ఆలయ గోడలకు మరమ్మతులు చేయించు. అలాదే దేవు డికి చిన్న రథం కూడా విరాళంగా ఇవ్వు.'' అని చెప్పింది.

ధర్మపాలుడు ఈ సారి కూడా భార్య చెప్పినట్లే చేశాడు. పైగా అతడు మరో అడుగు ముందుకు వేసి ఆలయ ప్రాంగ ణంలో కొత్తగా పరిచిన చలవరాళ్లన్నింటి మీదా తన పేరు చెక్కించాడు. ఆవిధంగా దేవుడు తన పేరు ఎన్నడూ మర్చిపోడని అతడి ఆశ. చివరకు విరాళంగా ఇచ్చిన కొత్త రథంపై కూడా పలు చోట్ల తన పేరు చెక్కించడం అతడు మర్చిపోలేదు.

ఒక మంచి రోజు చూసి దేవాలయా నికి వెళ్ళి దేవుడితో, ''ఓ స్వామీ! ఈసారి అయినా తప్పక ఆ గుప్తధనం మాకు





లభించేటట్టు చేయి.'' అని శతథా వేడుకుని వచ్చాడు.

కానీ గుప్తధనం ఈ సారీ అతడికి దక్కలేదు. పెట్టెను చేత్తో తాకాడో లేదా నాగుపాము మళ్లీ నిధికి అడ్డొచ్చింది.

ధర్మపాలుడికి ఏమీ పాలు పోలేదు. మళ్లీ భార్యను సలహా అడిగాడు.

భార్య ధర్మపాలుడికి ధైర్యం చెప్పింది. ''గుంతలో బయటపడిన గుప్తధనం చాలా ఉంది కదూ... మన ఆస్తినంతా అమ్మేసి గుడికి పెద్ద గోపురం కట్టించు. దేవుడికి బంగారు ఆభరణాలు చేయించు. ఊళ్లో కొలువై ఉన్న దేవుడికి ఇంతకంటే గొప్ప పని మనమైనా, ఎవరైనా చేయగలరా!'' అని భర్తకు సూచించింది.

ఆ విధంగా ధర్మపాలుడు ఆరు నెలలలో ఊరి గుడికి గోపురం కట్టించాడు. బంగారు ఆభరణాలు చేయించాడు, వాటిని దేవుడి విగ్రహంపై ప్రతిష్టించడం కూడా ముగిసింది.

ఇంత చేసినప్పటికీ ఇంటిలోనే ఉండి ఊరిస్తున్న గుప్తనిధి అతడి చేతికి దక్కలేదు. పెట్టెపై చేయి వేసిన వెంటనే నాగుపాము కనిపించి అతడి ప్రయత్నాలను వమ్ము చేసింది.

గుడి పునర్నిర్మాణం కోసం ఉన్న ఆస్తినంతా పోగొట్టుకుని కడు బీదవాడయ్యాడు ధర్మపాలుడు. సన్యాసి తనను నిండా మోసగించాడని నిశ్చయానికొచ్చాడు. సన్యాసి వద్దకు మరోసారి వెళ్లడానికి అతడికి మనస్కరించలేదు. అపర ధనవంతుడిగా అంతవరకు వెలిగిపోయిన ధర్మపాలుడు దారిద్ర్య జీవితానికి క్రమంగా అలవాటు పడిపోయాడు.

ఒక రోజు ధర్మపాలుడి ఇంటికి ఒక గుడ్డి బిక్షగాడొచ్చాడు. ధర్మపాలుడితో, ''అయ్యా, నేనొక గుడ్డి బిక్షగాణ్ణి. ఇంటింటికీ వెళ్లి గింజలు, కొన్ని కూరగాయలు తెచ్చుకున్నాను. కాని వాటిని వండుకుని తినడానికి నాకు వీలు కాదు, మీకు ఆ గింజలూ, కూరగాయలూ ఇస్తాను. వాటిని వండి పెట్టి, మీరూ కొంచెం తీసుకుని నాకూ కొంచెం ఇచ్చి పుణ్యం కట్టుకోండి'' అని బతిమాలాడు.

పేదరికమూ, ఆకలి అంటే ఏమిటో ఇప్పుడు స్వయంగా అనుభవిస్తున్న ధర్మపాలునికి ఆ గుడ్డి బిక్షగాడిని చూసి జాలి కలిగింది. సరే అని అలాగే ప్రతి



రోజూ చేస్తూ వచ్చాడు. కొన్నాళ్ళ తర్వాత గుడ్డివాడు ధర్మపాలుడితో మాట్లాడుతూ. ''అయ్యా! వీలుపడితే ఒక రోజు నా గుడిసె వద్దకు రండి. నాకంటే దరిద్రులైన వారు ఎంతోమంది అక్కడ ఉన్నారు. నాకు మీరు సహాయం చేస్తున్నట్లే వారికీ మీకు తోచిన సహాయం చేయవచ్చు'' అన్నాడు.

''సహాయం చేయడానికి నా వద్ద ఏమీ లేదే. నేను వారికేమి సాయం చేయ గలను.'' నిరాశగా అన్నాడు ధర్మపాలుడు. బిక్షగాడు మాట్లాడుతూ, ''మీరు సాయం చేయవచ్చు! మీరు వారికి చేతిసాయం చేయవచ్చు. మంచి మాటలతో వారికి స్వాంతన చేకూర్చవచ్చు'' అన్నాడు. ధర్మ పాలుడు అందుకు సమ్మతించాడు. నిరా శ్రయులైన ఆ దరిద్ర నారాయణులకు సేవ చేయడంలో అతడికి చాలా సంతోషం కలిగింది.

ఒక రోజు గుడ్డి భిక్షకుడు ధర్మపాలు నితో ''అయ్యా మీరు ఒకప్పుడు చాలా గొప్ప ధనవంతులు. మీకీ దుస్థితి ఎలా వచ్చింది,'' అని అడిగాడు. ధర్మపాలుడు జరిగిందంతా చెప్పాడు. గుడ్డివాడు, ''అయ్యా మీరు ఇంకో విధంగా అను కోకపోతే, నేనొక విషయం చెబుతాను. గుప్త ధనం దక్కకపోవడం వల్లనే మీకీ గతి పట్టింది. నేను ఆ పామును చంపి మీకా ధనం దక్కేటట్టు చేసి మీ ఋణం తీర్చు కుంటాను, పాములను పట్టే ఉపాయం నాకు తెలుసు,'' అన్నాడు.

ధర్మపాలుడు సంతోషించి, ''సరే'' అన్నాడు. గుడ్డివాడు లోపలికి వెళ్ళి గుప్త ధన పాత్రను తీయబోయాడు. ఆశ్చర్యం! ఏ పామూ రాలేదు!! ధర్మపాలుడు ఆ గుడ్డివాడికి చాలా ధనం ఇచ్చి, ''ఇక మీదట నీవూ బిక్షాటన మాని హాయిగా జీవితం గడుపు,'' అని చెప్పి పంపాడు. గుప్తధనంతో ధర్మపాలుడూ అతడి భార్యా సుఖంగా మునుపటి లాగే బీదలకు, సాధువులకు సహాయాలు చేస్తూ కాలం గడిపారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, ధర్మపాలుడు ఎన్నో గొప్ప పనులు చేశాడు. ఆలయానికి, దేవుడికి సంబంధించిన పనులు స్వంత ధనంతో పూర్తి కావిం చాడు. గుడి కోసం తన ఆస్తి మొత్తాన్ని ధారపోశాడు. అయినా దేవుడు తనపట్ల

కాసింత దయ కూడా చూపలేదు. కాగా గుడ్డివాడికి అతడు పెద్దగా సహాయం చేసింది లేదు. అతడికి వంట చేసి పెట్ట డంలో సహాయం చేశాడు. అలాగే, బిక్ష గాడి గుడిసెలో ఉన్న అనాథలకు కాస్తంత అండగా నిలిచి మాట సాయం, చేత సాయం మాత్రమే చేశాడు. అంత మాత్రా నికే దేవుడు కరుణించి గుప్త ధనం అత డికి చెందేలా చేయాలని నిర్ణయించాడు. ఇది వింతగా లేదా?

ఎన్ని గొప్ప పనులు చేసినప్పటికీ ధర్మపాలుడికి లభ్యం కాని గుప్త ధనం ఒక గుడ్డివాడికి కాస్తంత సహాయం చేయగానే ప్రాప్తించడానికి కారణం ఏమిటో తెలిసి చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది, జాగ్రత్త,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''మొదట్లో ధర్మపాలుడు చేసిన పనులన్నీ దురాశతో గుప్తధనం కోసం చేసినవే. దురాశతో స్వలాభంకోసం చేసిన పని ఎంత గొప్ప పని అయినా, దానధర్మమయినా, దేవుని సేవే అయినా ఫలితం ఇవ్వదు.

ధర్మపాలుడు పేదవాడైపోగానే, అతడు సన్యాసి మాటల్లో విశ్వాసం కోల్పోయాడు. గుప్తనిధి దక్కుతుందనే ఆశలు కూడా వదులుకున్నాడు. నిజంగా పేదరికంలో ఉన్నవారి బాధలను అతడు అప్పుడు మాత్రమే గ్రహించాడు. ఎలాంటి లాభా పేక్షలేకుండా వారికి నిస్వార్థంగా సహాయం చేయడం ప్రారంభించాడు.

ఏమీ ఆశించకుండా ప్రేమతో అనాథ లకు అతడు చేసిన చేతి సాయమే అన్ని టికంటే మించి విలువైనదిగా దేవుడి దృష్టికి అనిపించింది. దేవుడి పేరుతో ధర్మపాలుడు చేసిన అన్ని సహాయాలూ అతడు అనాథలకు చేసిన నిజమైన, అవసరమైన సహాయం ముందు తేలి పోయాయి.

ధర్మపాలుడు గుడ్డివాడికి చేసిన సహాయం మానవసేవ! మానవ సేవే మాధవసేవ కదూ! అందుకే దైవానుగ్రహం కలిగి గుప్తధనం ప్రాప్తించింది,! ''

రాజుకు ఈ విధంగా మౌన భంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు.

– కోలార్ కృష్ణ అయ్యర్





# కోణంగి దెయ్యం




కృష్ణాపురం గ్రామంలో అందరూ కష్ట జీవులే. అయితే ఊరందరిదీ ఒక దారి అయితే, ఉలిపిరి కట్టెది ఒకదారి అయి నట్లు, ఆ ఊర్లో రంగడికి చదువు సంధ్యలు అబ్బకపోవడంతోపాటూ, ఏ పని చేయ కుండా గాలికబుర్లు చెప్పుకుంటూ పొద్దు పుచ్చడం అలవాటయింది. అందులోనూ వాడి తల్లిదండ్రులు చిన్నతనంలోనే చని పోవడం వల్ల పండు ముసలిదైన రంగడి అవ్వ వాడి బాగోగులను చూస్తుండేది. అవ్వకి చూపు కూడ మందగించడంతో రంగడి జులాయితనం పెట్రేగిపోయింది.

రోజూ అవ్వ కన్నుగప్పి ఇంట్లో ఉన్న ఏదో ఒక వస్తువుని తీసుకెళ్లి అమ్ముకుని జల్సా ఖర్చులు చేయడం నేర్చుకున్నాడు. రంగడి జులాయితనం సహించలేని అవ్వ, ఓ రోజు వాడిని ఇంట్లోకి చేరనివ్వకుండా నానా శాపనార్థాలు పెట్టింది. ఆ రోజంతా అవ్వ తనను ఇంట్లోకి రానివ్వకపోవడంతో రంగడు ఆ రాత్రి ఆరుబయటే నిద్రపో యాడు.

మరుసటిరోజు ఉదయం బాగా ఎండ వచ్చేంతవరకు గుర్రుపెట్టి నిద్రపోతున్న రంగడిని చూసిన అవ్వ మరలా తిట్టడం మొదలెట్టింది.

ఇక మీదట తనను తిడితే ఇల్లు విడిచి పోతానని రంగడు బెదిరించినప్పటికీ అవ్వ తిట్టడం మానలేదు. కాసేపు అవ్వ తిట్లను భరించిన రంగడు ఇల్లు విడిచి వెళ్లిపోతు న్నానంటూ చివాల్న లేచి బయలుదేరాడు. అప్పుడప్పుడు రంగడు ఇలా ఇల్లు విడిచి వెళ్లిపోతాననడం మామూలే కాబట్టి, అవ్వ వాడి మాటలను లెక్కచేయలేదు.

ఊరి పొలిమేర దాటిన రంగడు మధ్యాహ్న సమయానికి ఓ చిట్టడవిలోకి ప్రవేశించాడు. అంతకు ముందు రోజు నుంచి భోజనం చేయకపోవడం వల్ల ఊరి పొలిమేరకి వచ్చేసరికి శోషవచ్చింది.

యిమ్మడిశెట్టి కోటేశ్వరరావు




కాస్తంత నీరసంగా అన్పించడంతో రహదారి పక్కనున్న ఓ మర్రిచెట్టు నీడ కింద నడుము వాల్చాడు, మరల కళ్లు తెరిచి చూసే సరికి చుట్టూ దట్టమైన చీకటి ఆవరించి ఉంది.

అసలే చీకటిని చూసి భయపడుతున్న రంగడికి గాలికి ఊగుతున్న మర్రి ఊడలు మరింత భయాన్ని కలుగ జేశాయి. వాడు ఎక్కడ లేని ధైర్యం కూడగట్టుకుని ఇంటి వైపుకు పరుగుపెడదామని అనుకుంటూండగా, మర్రి చెట్టు కదిలిపోయేలా ఓ బలమైన ఈదురుగాలి వీచింది. ఆ గాలి ధాటికి కళ్లు మూసుకున్న రంగడు కళ్లు తెరవగానే అతని ముందు ఒక దెయ్యం ప్రత్యక్షమైంది. ఆ దెయ్యాన్ని చూసిన రంగడు భయంతో గజగజ వణికిపోయాడు. “ఓరీ పిల్లమనిషీ! నా మర్రి చెట్టు నీడలో విశ్రమించడానికి నీకెంత ధైర్యం? అని ఆ దెయ్య రంగడిని గద్దించింది. తనని చూసిన వెంటనే ప్రాణాలు తీసేస్తానని అనకుండా, మామూలు ప్రశ్నలు అడుగుతున్న దెయ్యాన్ని చూసిన రంగడి మనసులో మెల్లగా ధైర్యం ప్రవేశించింది.

దెయ్యం మాటల ద్వారా దాని పేరు కోణంగి అని తెలుసుకున్న రంగడు, “ఏం చెయ్యమంటారు కోణంగి గారూ! మా ఇంట్లో ఓ ముసలి అవ్వ ఉంది. పనీపాటా చేయడం లేదని పొద్దస్తమానం నన్ను తిడుతూనే ఉంటుంది. నాకేమో ఒళ్లొంచి పని చేయాలనిపించదు. నిన్నట్నుంచి మా అవ్వ తిట్టిన తిట్లకి విసిగిపోయి ఎట్టైనా వెళ్లిపోదామని పట్నం బయలు దేరాను,” అంటూ తన బాధని కోణంగి దెయ్యానికి చెప్పుకున్నాడు.

రంగడి మాటల్ని సాలోచనగా విన్న దెయ్యం, ‘నేను మనిషిగా ఉన్నప్పుడు చేసిన కొన్ని తప్పిదాలు నాకు ఈ దెయ్యం రూపాన్ని తెచ్చిపెట్టాయి. కాబట్టి బుద్ధిగా వెళ్లి పండు ముసల్ది అయిన మీ అవ్వకి పనుల్లో సాయపడు, వెళ్లు,” అని వాడిని మందలించింది.

కోణంగి మాటలకు అడ్డుపడుతూ, “ఆ ఏం మనిషి జన్మ!? ఎక్కడికైనా హాయిగా ఎగిరివెళ్తూ, పనీపాటా లేకుండా గడుపుతుంటారు మీరు. పని చేస్తేనే తిండి దొరుకుతుందన్న బాధ మీకు లేదు కదా!’ అని నిట్టూర్చాడు. ఈలోపు కక్కడు, లప్పడు, చిప్పడు అనే దెయ్యాలు కూడ అక్కడికి రావడంతో వాదన వేడి అందు

కుంది. తాను నాలుగు దెయ్యాలతో మాట్లాడుతున్నానన్న సంగతినే మర్చిపో యాడు రంగడు.

రంగడి వాదనను విన్న కక్కడు దెయ్యం, ''అయితే నీకు మనిషి రూపం విరక్తి పుట్టిందన్నమాట. నువ్వు ఇష్టపడితే మా దగ్గరున్న ప్రేతశక్తుల ద్వారా మాలో ఒకరు నీ రూపాన్ని పొందుతాం. నువ్వు మాలో ఎవరి రూపాన్నైనా ధరిస్తావా?'' అని రంగడ్ని ప్రశ్నించింది.

కక్కడు దెయ్యం చెప్పిన పద్ధతి రంగడికి బాగా నచ్చింది. హాయిగా దెయ్యం రూపం ఎత్తితే, ఎలాంటి బాదరబందీ లేకుండా మర్రిచెట్టుకి తల్లకిందులుగా వేలాడుతూ గడిపేయవచ్చుననుకున్న రంగడు, వెంటనే తన సమ్మతిని తెలియజేశాడు. అక్కడున్న నాలుగు దెయ్యాలలో కోణంగి దెయ్యం కాస్త మంచిదిగా అనిపించడంతో, తను కోణంగి రూపాన్ని ధరిస్తానని, కోణంగి తన రూపాన్ని ధరించవచ్చని చెప్పాడు. అయితే తనకు దెయ్యం జీవితం పట్ల మొహ మెత్తినప్పుడు, తన అసలు రూపాన్ని తనకు ఇచ్చేయాలని ఒప్పందం చేసుకున్నాడు. వెంటనే కోణంగి దెయ్యం రంగడి తలపై చేయి ఆనించి, ఓ పిశాచిమంత్రాన్ని జపిం చడంతో రంగడు కోణంగి దెయ్యంగా, కోణంగి దెయ్యం రంగడుగా మారిపో యారు.

దెయ్యం రూపాన్ని ధరించిన రంగడు పొద్దస్తమానం మర్రిచెట్టుకు తల్లకింది లుగా వేలాడుతూ, అదీ కాకపోతే కాసేపు




కక్కడు, లప్పడు, చిప్పడు దెయ్యాలతో గాలి కబుర్లు చెప్పడం చేస్తుండేవాడు. ఆ దెయ్యాలు కూడ రంగడివలె సోమరిపో తులే కాబట్టి వాడి మాటలే వినసాగాయి.

రంగడిరూపంలో కృష్ణాపురం చేరిన కోణంగి దెయ్యం ప్రతి పనిలో అవ్వకి సాయపడసాగింది. రంగడిలోని మార్పును చూసిన ఊరిజనమంతా ఆశ్చర్యపడ్డారు. మనిషి రూపం కోణంగి దెయ్యానికి సంతో షాన్నివ్వడంతో కలకాలం రంగడి రూపం లోనే ఉండాలనుకుంది. రంగడు వచ్చి తన రూపాన్ని తిరిగి ఇవ్వమని అడిగితే ఒప్పు కోకూడదని నిర్ణయించుకుంది ఆ కోణంగి దెయ్యం.

కొంత కాలానికి కోణంగి రూపంలో ఎల్లవేళలా మర్రిచెట్టుకు వేలాడుతుం డటం రంగడికి విసుగనిపించింది. అలా అనిపించిందే తడవుగా ఒకరోజు రాత్రి కృష్ణాపురంలోకి ప్రవేశించి, తన రూపంలో

గుర్రుపెట్టి నిద్రపోతున్న కోణంగి దెయ్యాన్ని లేపాడు. ముందుగా అనుకున్న మాట ప్రకారం తన రూపాన్ని తిరిగి ఇవ్వమని కోణంగిని అడిగాడు. అందుకు కోణంగి ఎంతమాత్రం ఒప్పుకోలేదు. రంగడు కాళ్లావేళ్లా పడినప్పటికీ కోణంగి దెయ్యం మాట వినకపోవడంతో రంగడు విచారంగా వెనక్కి తిరిగిపోయాడు.

ఇదిలా ఉండగా, ఒకరోజు తెల్లవారగనే ఇంటిముందు ఊరిపెద్దలంతా గుమిగూడి ఉండటం రంగడి రూపంలో ఉన్న కోణంగికి ఆశ్చర్యమనిపించింది. విషయమేమిటో తెలుసుకోవాలని బయటకొచ్చిన కోణంగిని "రంగా రెండు సంవత్సరాల క్రితం తీసుకున్న మా బాకీని ఎప్పుడు తిరిగిస్తావ్?" అంటూ గద్దించిన ఓ పెద్ద మనిషి రంగడిని పెడరెక్కలు విరిచి ఓ చెట్టుకు కట్టేసి కొట్టసాగాడు. అలా రోజూ ఎవరో ఒకరు వచ్చి రంగడి రూపంలో ఉన్న కోణంగిని దుడ్డుకర్రలతో బాదసాగారు. రోజూ దెబ్బల్తో పంబ రేగుతుండడంతో భరించలేని కోణంగి పరుగుపరుగున వెళ్లి రంగడి దగ్గర తన రూపాన్ని తనకివ్వమని అడిగింది. ఆ క్షణం కోసమే ఎదురుచూస్తున్న రంగడు వెంటనే తన రూపాన్ని తాను ధరించి, కోణంగి రూపాన్ని కోణంగికి ఇచ్చేశాడు. ఇంతలో అక్కడికొచ్చిన కక్కడు, లప్పడు, చిప్పడు దెయ్యాలు రంగడి రూపాన్ని ఎందుకు తిరిగి ఇచ్చేస్తున్నావని కోణంగిని అడిగాయి. "ఏమని చెప్పేది? వీడు చేసిన అప్పులను తీర్చమంటూ రోజుకొకడు వచ్చి నా ఒళ్లంతా హూనం చేస్తుంటే నావల్లకాలేదు," అంటూ నిట్టూర్చింది కోణంగి దెయ్యం.

కోణంగి మాటల్ని విన్న రంగడు బిగ్గరగా నవ్వుతూ, "మొత్తానికి నేను చేసిన అప్పులు నన్ను ఈ దెయ్యం రూపం నుంచి బయటపడేసాయన్నమాట. ఏది ఏమైనా కష్టించి పనిచేయడంలో గల గొప్పదనాన్ని నాకు తెలిసేట్లు చేసినందుకు మీ దెయ్యాలందరికీ కృతజ్ఞతలు. ఇకపై కష్టించి పని చేస్తూ చదువుకుంటా. నా అవ్వని కంటికి రెప్పలా చూసుకుంటా, వస్తా," అంటూ కృష్ణాపురం వైపు సాగిపోయాడు. అలా కోణంగి దెయ్యం దెబ్బతో జులాయి రంగడు బుద్ధిమంతుడయ్యాడు.





# సాధువూ - రైతూ

ఒక చిన్న పల్లెకు, ఒక సాధువు వచ్చి చెరువు గట్టున ఉన్న మర్రిచెట్టు కింద లేడి చర్మం పరుచుకుని కూర్చున్నాడు. పల్లెవాసులు ఆయన ముందు పళ్లూ, ఫలహారాలూ పెట్టి వెళ్లిపోసాగారు.

సాధువు వాళ్లతో, ''సూర్యాస్తమయం ఇంకా ఒకటి రెండు గంటలున్నదనగా రండి. భక్తి, వైరాగ్యాల గురించి మీకు విపులంగా చెప్పదలిచాను,'' అని అన్నాడు.

అయితే, తొలకరి వానలు కురిసి మంచి వ్యవసాయప్పనుల తరుణం కావడంతో, సూర్యాస్తమయానికి కొంచెం ముందుగా, ఆయన దగ్గిరకు ఒకే ఒక వ్యక్తి వచ్చాడు. అతడు పల్లెలో చిన్న రైతు. సాధువు అతణ్ణి చూసి నిరుత్సాహంగా ''మీ పల్లెవాసుల ముందు ఎన్నో విషయాల గురించి మాట్లాడాలనుకున్నాను. నువ్వు ఒక్కడివే వచ్చావు. మాట్లాడమంటావా?'' అని అడిగాడు.

అందుకు రైతు, ''స్వామీ, నేను దండిగా పశువుల మేత తీసుకుని, అవి ఉండే చావడిలోకి వెళ్లినప్పుడు, అక్కడ ఒకే ఒక ఆవు ఉన్నా, దానికి మేత వేస్తాను,''అన్నాడు.

ఈ జవాబుకు సాధువు తృప్తిపడి, దాదాపు రెండు గంటల కాలం భక్తి, వైరాగ్యాల గురించి ప్రసంగం కొనసాగించాడు.

తర్వాత ఆయన రైతును ''నా ప్రసంగం ఎలా ఉన్నది?'' అని అడిగాడు.

రైతు వినయంగా, ''స్వామీ, నేను పశువుల చావడిలోకి చాలా మేత తీసుకుపోయినా, అక్కడ ఉన్న ఒకే ఒక ఆవు చేత దాన్నంతా తినిపించే ప్రయత్నం చేయను!'' అని అక్కడి నుంచి వెళ్లిపోయాడు.

– వి. చైతన్య



# శ్రీనివాస కల్యాణం-3



## శ్వేతవరాహుడు; శ్రీనివాసుడు

రోజులు గడుస్తున్నాయి. గోశాలలో ఉన్నం తసేపూ పొదుగులో పాలను ఎగబట్టడం, వేంకటాద్రికి చేరగానే పుట్టవద్దకెళ్ళి పుట్ట లోకి పాలను వర్షించటం ఆవుకు నిత్య కృత్యం అయిపోయింది.

బాల యువరాజుకు కొత్తగా కొన్న ఆవు పాలు పట్టడం లేదన్న సంగతి రాణీగారికి తెలియవచ్చింది. పశువులకాపరి అయిన గొల్లవాడిమీద రాణికి అనుమానం వేసింది. కొత్త ఆవు పాలను గోపాలకుడే దొంగిలించి వేస్తున్నాడన్న నిర్ణయానికి వచ్చి రాణి, అత డిని మందిరానికి పిలిపించి ప్రశ్నించింది.

అమాయకుడైన గోపాలకుడు తనకు ఏ పాపమూ తెలీదన్నాడు. ''ఆవుపాలను నువ్వైనా తాగుతూ ఉండాలి; లేదంటే పూర్తిగా దూడైనా తాగేస్తూ ఉండాలి. నిజం చెప్పు'' అంటూ గద్దించింది రాణి.

గోపాలకుడు కుయ్యో మొర్రో అన్నాడు. 'నేను తాగడంలేదు, పాపం దూడ కూడా తాగడం లేదు. ఆవు దాని పాలను అదే తాగేస్తూ ఉంటుంది, మారాణీ..!'' అన్నాడు.

గోపాలకుడి సమాధానం రాణీగారికి కోపం తెప్పించింది. చర్మంతో చేసిన కొరడాతో గోపాలకుడిని కొట్టించింది. గోపాలకుడి శరీరం నిండా వాతలు పడ్డాయి. గోపాలకుడు బాధతో, అవమానంతో కుమిలిపోయాడు. ఆవు తన పాలను ఎలా మాయం చేస్తోంది కనిపెట్టాలనుకున్నాడు.

తనను వాతలు పడేలా కొట్టించిన ఆవు మీద కోపంతో రగిలిపోతున్న గోపాలకుడు, చరచరా నడవడానికి వీలు లేకుండా ఆవు కాలికీ, మెడకూ తాడుతో బంధంవేసి, మందతోబాటు కొండమీదికి తోలుకెళ్ళాడు. ఏపుగా ఉన్న పచ్చికను మేయకుండా ఆవు నెమ్మదిగా కుంటుతూ పుట్టవైపు దారి తీసింది. గోపాలకుడు చప్పుడు చేయకుండా

నక్కాంతం సూర్యనారాయణ రావు

వెంబడించాడు. ఆవు ఎత్తైన పుట్టమీదికి ఎక్కి పొదుగులోంచి పాలను పుట్టరంధ్రం లోకి వదలసాగింది.

పాలను పుట్టపాలు చేస్తున్న ఆవుమీద కోపంతో ఊగిపోయాడు గోపాలకుడు. చేతపట్టుకున్న గండ్రగొడ్డలితో ఆవు తల నరికే ప్రయత్నం చేశాడు. వెంటనే పుట్టలో ఉన్న విష్ణువు వెలికివచ్చి గొడ్డలిదెబ్బ ఆవుకు తగలకుండా తన తలను అడ్డుపెట్టాడు. గోపాలకుడి గండ్రగొడ్డలి దెబ్బ ఆయన తలకు తగిలింది. పెద్ద గాయమై, రక్తం కారసాగింది.

హఠాత్తుగా పుట్టలోనుంచి ప్రత్యక్షమైన దివ్యపురుషుడినీ, తన గొడ్డలి చేసిన గాయం నుంచి కారుతూ కాలువపట్టిన నెత్తురునూ చూసి భీతిల్లిన గోపాలకుడు మరణించి, కిందపడిపోయాడు. విష్ణువు పుట్టలోపలికి వెళ్ళిపోయాడు.

జరిగిన దానిని గమనించిన ఆవు వెను దిరిగి, మందలోకి వెళ్ళకుండా, చోళరాజు మందిరానికి వెళ్ళింది. ఆయనముందు కన్నీళ్ళు కారుస్తూ, నేలమీదపడి దుఃఖంతో అటూ, ఇటూ దొర్లసాగింది. ఆవు చేష్టలు చూసి, చోళరాజు నివ్వెరపోయాడు. మందను వదలి ఆవు ఒంటరిగా ఎందుకు తిరిగి వచ్చిందో ఆయనకు అర్థంకాలేదు. వెంటనే ఒక చారుణ్ని పిలిపించాడు.

ఆవును లేపి, తోలుకెళ్ళి మందలో కలిపి, గోపాలకుడిని హెచ్చరించి రమ్మని ఆజ్ఞా పించాడు. ఆయన మాటలు అర్థం చేసు కున్నట్లు ఆవు పొర్లడం మాని, లేచి నిలబ డింది. ఒకసారి చారుడివైపు చూసి, మంది రంలోంచి అవతలకి అడుగులు వేసింది.



ముందు నడుస్తున్న ఆవు చారుడిని వేంకటాద్రి మీద ఉన్న పుట్ట దగ్గరికి చేర్చింది. చారుడు అక్కడ గోపాలకుడి శవాన్నీ, కాలువ కట్టిన రక్తాన్నీ చూసి నిర్ఘాంతపోయాడు. ఆవును మందవైపు మళ్ళించి, తాను ఇంటి దారిపట్టాడు. మరణించిన గోపాలకుడి గురించీ, రక్త ప్రవాహం గురించీ రాజుకు విన్నవించాడు.

ఆశ్చర్యపోయిన చోళరాజు గోపాలకుడు ఎందుకు మరణించాడో తెలుసుకోవాలను కున్నాడు. వెంటనే పల్లకీమీద వేంకటాద్రి పుష్కరిణి ప్రాంతం చేరుకున్నాడు.

గోపాలకుడి శవాన్నీ, రక్తాన్నీ చూసి చోళ రాజు కోపావేశంతో ఒళ్లు మరిచిపోయాడు. ''ఈ దారుణానికి కారకులు ఎవరు, ఎవ రైనా సరే శిక్షించి తీరుతాన''ని అంటూ అరి చాడు. ఆ అరుపులు విని విష్ణువు పుట్టలో నుంచి వెలుపలికి వచ్చాడు. ''గోమాతను చంపబోయిన గోపాలకుడి గొడ్డలిదెబ్బ, నాతలకు తగిలి గాయమైంది. గోపాల



కుడు భయంతో మరణించాడు. వాడు నీ సేవకుడు. నన్ను గాయపరచి అపరాధం చేశాడు. సేవకుడు చేసిన తప్పులకు యజమాని బాధ్యుడు. గోపాలకుడు చేసిన నేరానికి నిన్ను శిక్షిస్తున్నాను. పిశాచివైపో..!'' అంటూ శపించాడు.

ఆయనను విష్ణువుగా తెలుసుకున్న చోళరాజు క్షమాబిక్ష కోరాడు. విష్ణువు శాప విమోచన విధిని వివరించి, వెళ్ళమన్నాడు. చోళరాజు పిశాచిగా మారి అడవులు పట్టుకుని వెళ్ళిపోయాడు.

విష్ణువు గోపాలకుడిని బ్రతికించాడు. గొడ్డలితో కొట్టినందుకు గోపాలకుడు పశ్చాత్తాపం వెలిబుచ్చాడు. విష్ణువు అతడిని క్షమించాడు. భవిష్యత్తులో వేంకటాద్రిమీద అర్చామూర్తిగా ఆలయంలో నెలకొనే తనను ప్రతిరోజూ మొట్టమొదటిసారి దర్శించుకునే అవకాశం అతనికీ, అతని వంశీకులకు తరతరాలు ఉండేలా గోపాలకుడికి వరమిచ్చాడు. గోపాలకుడు ఆయనను స్తుతించి, నగరానికి వెళ్ళిపోయాడు.

విష్ణువు దేవతల గురువైన బృహస్పతిని స్మరించాడు. వెంటనే బృహస్పతి ఆయన ముందు ప్రత్యక్షమయ్యాడు. విష్ణువు తన తలకు తగిలిన గాయాన్ని ఆయనకు చూపించి, తగిన మందును సూచించమని అడిగాడు. ''మేడిచెట్టు పాలతో జిల్లేడు దూదిని తడిపి కట్టు కడుతూ ఉంటే గాయం త్వరగా మానిపోతుందన్నాడు'' బృహస్పతి.

మేడిచెట్టు పాలతో గాయానికి వైద్యం చేసుకుంటూ చింతచెట్టుకింది పుట్టలోనే వాసం చేస్తూ, కాలం గడుపుతూ, లక్ష్మికోసం పరితపిస్తూ ఉండిపోయాడు విష్ణువు. ఒకనాడు మేడిపాల కోసం పర్వతంమీద వెదుకుతూ తిరుగుతున్నాడు. అదే సమయంలో అటుగా వస్తున్న శ్వేతవరాహమూర్తి కంట బడ్డాడు.

''అనుమతి లేకుండా నా రాజ్యంలో సంచరిస్తున్నది ఎవరు?'' అంటూ పెడబొబ్బలు పెట్టాడు శ్వేత వరాహుడు. ఆయనను చూడగానే విష్ణువు పరుగునవెళ్ళి పుట్టలో నక్కి దాక్కున్నాడు. శ్వేత వరాహుడు సమీపానికి వచ్చి, పుట్టలోనుండి వెలుపలికి రమ్మంటూ హుంకరించాడు. విష్ణువు వెలుపలికి వచ్చి శ్వేత వరాహస్వామి ముందు నిలుచున్నాడు. శ్వేతవరాహుడూ, విష్ణువూ చూడగానే ఒకరినొకరు పోల్చుకున్నారు. లక్ష్మి అలిగి వెళ్ళిపోయిన కారణంగా ఆమెను అన్వేషిస్తూ అక్కడికి చేరుకున్నట్టు చెప్పాడు విష్ణువు.

శ్వేతవరాహంగా ఆవిర్భవించి, హిరణ్యాక్షుడిని వధించి, భూమిని ఉద్ధరించిన

నాటినుండీ ఆ పర్వతంమీదనే నివసిస్తు న్నట్లు వివరించాడు శ్వేతవరాహుడు. ఆ పర్వతం శేషాద్రి, గరుడాద్రి, వేంకటాద్రి, నారాయణాద్రి, వృషాద్రి, వృషభాద్రి, అంజనాద్రి అనే సప్తగిరుల సముదాయ మనీ, అదంతా తన సామ్రాజ్యమనీ చెప్పాడు.

తాను భూలోకంలో వేంకటాచలంమీద శ్రీనివాసుడు అనే పేరుతో ఉంటున్నట్లు శ్రీమహావిష్ణువు, శ్వేతవరాహుడితో చెప్పాడు. ''శ్వేతవరాహదేవా.. నువ్వు ఎవరోకాదు, నా అంశావతారానివే. కలియుగం పూర్తయ్యే దాకా నేను వేంకటాద్రిమీదనే ఉండాలను కుంటున్నాను. నూరు అడుగుల స్థలం నాకు దానంచేయి'' అన్నాడు.

''ప్రతిఫలంగా ధనం లేకుండా స్థలం ఇవ్వను'' అని తేల్చి చెప్పాడు శ్వేతవరాహుడు.

''ప్రతిఫలంగా ధనాన్ని మించిన ఐశ్వ ర్యాన్ని ఇస్తాను. భవిష్యత్తులో ఈ పర్వతం మహాక్షేత్రం అవుతుంది. భక్తులు నా దర్శనం కోసం తండోపతండాలుగా ఇక్కడికి వస్తారు. నన్ను దర్శించుకునేందుకు ముందు విధిగా నిన్ను దర్శించి, నీకు క్షీరాభిషేకం చేసి, నైవేద్యం అర్పించే విధంగా నిర్ణయిస్తు న్నాను'' అన్నాడు శ్రీనివాసుడు.

శ్వేతవరాహుడు సంతోషంతో అంగీకరిం చాడు. శ్రీనివాసుడు కోరిన విధంగా పుష్క రిణీ తీరంలో నూరు అడుగుల స్థలాన్ని ధారాదత్తం చేశాడు. తన అనుమతితో, తన సామ్రాజ్యంలో నివసిస్తున్న వకుళమాలిక అనే స్త్రీని శ్రీనివాసుడికి వంటకత్తెగా నియ మిస్తానన్నాడు శ్వేతవరాహుడు. ఆయన భోజనం కోసం ప్రతిరోజూ శ్యామధాన్యాన్నీ, తేనెనూ ఇస్తానన్నాడు.

శ్వేత వరాహుడు శ్రీనివాసుడికి వకుళ మాతను పరిచయం చేశాడు. శ్రీనివాసుడిని చూడగానే వకుళమాలికను ఏదో తెలియని ఆనందం ఆవరించింది. శ్రీనివాసుడి దివ్య మంగళ స్వరూపం ఆమెకు పారవశ్యం కలిగిం చింది. సపర్యలు చేస్తూ, చక్కగా వండి పెడుతూ శ్రీనివాసుడిని కన్నబిడ్డలా చూసు కుంటానంది.

వకుళమాలిక వాత్సల్యంతో చేసే ఉప చారాలు శ్రీనివాసుడి మానసిక వేదనను, గాయంమూలంగా కలిగే బాధనూ దూరం చేస్తున్నాయి. వకుళమాలిక క్రమం తప్ప కుండా శ్రీనివాసుడి గాయానికి మేడి పాలతో వైద్యం చేయసాగింది. ఆమె చేతి చలవతో గాయం త్వరగా మానిపోయింది. పర్వతంమీద విహరిస్తూ, శ్రీనివాసుడు హాయిగా కాలం వెళ్ళదీస్తున్నాడు.





# పంచతంత్ర కథలు



సాలెవాడు మాత్రం రాజకుమార్తెకు మాట ఇచ్చిన మరుక్షణం నుంచీ విచారంలో మునిగిపోయాడు. తాను ఏం చెయ్యాలి? గరుడవాహనం మీద తాను ఎటైనా పారి పోవచ్చు. కాని తన ప్రియురాలు తనకు దక్కదు. విక్రమసేనుడు తన మామను చంపి, సుదర్శనను ఎత్తుకు పోయి పెళ్లి చేసుకుంటాడు. తాను యుద్ధం చేస్తే తన చావు తప్పదు. ప్రియురాలి ఎడబాటు వల్ల కూడా తనకు చావే కలుగుతుంది. ఎలాగూ చావు తప్పనప్పుడు ధైర్యంగా చావటమే వివేకం. తాను నారాయణమూర్తి వేషంలో యుద్ధానికి పోతే శత్రువు భ్రమపడి, బెదిరి పారిపోనూ వచ్చు.

సాలెవాడు ఇలా నిర్ణయించుకునేసరికి అసలు వైకుంఠంలో గరుత్మంతుడు శ్రీమన్నారాయణ మూర్తి వారితో భూలోకంలో జరిగినదంతా చెప్పి, ''దేవా, నీ రూపం ధరించి తిరుగుతున్న ఈ సాలెవాడు యుద్ధంలో చస్తే, ఇక మీకు పూజా పునస్కారాలుండవు. మీలో ప్రజలకు విశ్వాసం పోతుంది. మరి ఏం చేస్తారో ఆలోచించండి,'' అన్నాడు.

దానికి నారాయణమూర్తివారు, ''పక్షిరాజా, అక్రమంగా కప్పాలు వసూలు చేస్తున్నందుకు విక్రమసేనుడు చావాలి. పైపెచ్చు, వాడు నా భక్తులైన రాజు వంశాన్ని నిర్మూలించ జూస్తున్నాడు. నేను సాలెవాణ్ణి ఆవహించి, వాడి చక్రంలో ప్రవేశిస్తాను,'' అన్నాడు.

తెల్లవారు ఝామునే సాలెవాడు రాజకుమార్తె సహాయంతో యుద్ధసన్నద్ధుడైనాడు. రాజు కూడా తన సైన్యంతో సహా యుద్ధం చెయ్యడానికి నగరం వెలువడ్డాడు. రెండు సేనలూ యుద్ధానికి తలపడ్డాయి. సాలెవాడు తన గరుడ వాహనం మీద ఆకాశం మీదుగా ఎగురుతూ యుద్ధరంగానికి వెళ్లి, సేనలకు ఎగువగా గాలికి నిలిచి, శంఖం పూరించాడు.

శంఖనాదం విని పైకి చూసి, శత్రు సేనలు, విష్ణుమూర్తే తమతో యుద్ధానికి వచ్చాడనుకుని బెదిరిపోయాయి. చాలా

మిత్రభేదం- 12



నమస్కరించి, పింగళకం అనుమతితో కూర్చున్నది.

''నన్ను ఇంతకాలం చూడవచ్చావు కావేం?'' అని పింగళకం అడిగింది.

''ఏలినవారి క్షేమ భద్రతల దృష్ట్యా ఒక అతి ముఖ్య విషయం మనవి చేయటానికి ఇలా వచ్చాను. ఒక్కొక్కసారి, యజమానికి రుచించని మాటలు కూడా భృత్యులు మనసు విప్పి చెప్పవలసి ఉంటుంది. రుచించని సత్యాలు చెప్పే ధైర్యం విశ్వాసపాత్రులైన భృత్యులకే ఉంటుంది,'' అన్నది దమనకం.

''ఏమిటి నువు చెప్పదలిచిన సంగతి?'' అని పింగళకం ఆసక్తితో అడిగింది.

''మహారాజా, ఏలిన వారి ఆదరానికి పాత్రమైన సంజీవకం రాజద్రోహానికి ఒడిగట్టాడు. తమరిని చంపి, సింహాసనం చేజిక్కించుకునే ఎత్తుగడలను చాలా మందికి తెలిపాడు. ఇవాళే ఈ కుట్ర అమలు జరుగుతుందట. అనువంశికంగా తమ కొలువు చేస్తున్న నా విధి గనక, తమర్ని హెచ్చరించటానికి వచ్చాను,'' అన్నది దమనకం.

ఈ వార్త విని పింగళకం అదిరి పోయింది. అది గమనించి దమనకం, ''మహారాజా, కదిలిన పంటిని పెరికెయ్యాలి. వ్యాధిని అంకురంలోనే తుంచెయ్యాలి. శత్రువుగా తయారైన వాణ్ణి నాశనం చెయ్యాలి. పరిపాలన యావత్తూ ఈ ఎద్దుకు అప్పగించి, తమరు పెద్ద చిక్కులో పడ్డారు,'' అన్నది.

''కాని, సంజీవకం ఉన్నట్టుండి నాకెందుకు ద్రోహం తలపెట్టాలి? నేను అతనికి అసంతృప్తి కలిగించడానికి ఏమీ చెయ్యలేదే?'' అని పింగళకం అడిగింది.

మంది పడిపోయారు. కొందరు మూర్ఛపోయారు. కొందరు వెర్రిగా ఆకాశం కేసి చూస్తూ ఉండిపోయారు. ఆ సమయంలో సాలెవాడు తన చక్రాన్ని విక్రమసేనుడిపై విసిరాడు. అది విక్రమసేనుణ్ణి రెండుగా నరికి, సాలెవాడి చేతికి తిరిగి వచ్చింది. అతని సామంతులందరూ సాలెవాడి ముందు సాష్టాంగపడి, శరణు వేడారు.

''ఇకనుంచీ మీరు సుప్రతివర్మకు లోబడి ఉండండి.'' అన్నాడు సాలెవాడు. అందరూ అందుకు ఒప్పుకున్నారు. విక్రమసేనుడి బలాలన్నీ సుప్రతివర్మ పరం అయాయి. అనంతరం సాలెవాడు శాశ్వతంగా రాజకుమార్తెతో సమస్త సుఖాలూ అనుభవించాడు.

దమనకం చెప్పిన కథ విని కరటకం, ''సరే నీకంత నమ్మకం ఉన్నది గనక పింగళకం వద్దకు వెళ్ళి, నీ యుక్తి పారుతుందేమో చూడు, విజయీభవ!'' అన్నది.

దమనకం పింగళకం వద్దకు వెళ్ళి వంగి

‘‘దుర్మార్గుడికి కారణాలు కావాలా మహారాజా? అతను మొదటి నుంచీ ద్రోహ బుద్ధి తోనే ఉన్నాడని అనుమానం. తమరూ, ఈ ఎద్దూ లాంటి బలశాలులు ఇద్దరికీ, ఈ అరణ్యంలో తావు లేదు. అతను కపటంగా తమ అనుగ్రహం సంపాదించి, పెట్టిన చేతినే కరిచే ఉద్దేశంలో ఉన్నాడు. మీరు కృతఘ్నుడి కథ వినలేదా?’’ అన్నది దమనకం.

‘‘ఏమిటా కథ?’’ అని పింగళకం అడిగింది. దమనకం ఇలా చెప్పింది:

కృతఘ్నుడి కథ

యజ్ఞదత్తుడనే పనికిమాలిన దరిద్రుడికి గంపెడు పిల్లలు. ఒక రోజల్లా ఇంటిల్లిపాదీ పస్తులున్న మీదట యజ్ఞదత్తుడి భార్యకు కోపం వచ్చి, ‘‘పనికిమాలిన కటికవాడా, నీ పిల్లలు ఆకలికి చూడడం కనబడటం లేదా? ఏమీ పట్టనట్టు చేతులు కట్టుకుని కూర్చున్నావేం? ఎటైనా వెళ్లి ఏమైనా సంపాదించి మరీ తిరిగిరా,’’ అన్నది.

ఈ మాటకు నొచ్చుకుని ఆ బ్రాహ్మడు ఇంటినుంచి బయలు దేరాడు. చాలా దూరం వెళ్లగా, ఒక అడవి వచ్చింది. అతనికి దాహం వేసి, నీటి కోసం వెతక సాగాడు. కీకారణ్యం మధ్య ఒక లోతైన గుంట కనిపించింది. దాని చుట్టూ గడ్డి ఏపుగా పెరిగి ఉన్నది గాని, అందులో నీరు లేదు. యజ్ఞదత్తుడు అందులోకి తొంగి చూసే సరికి అతనికి ఒక పులీ, ఒక కోతీ, ఒక పామూ, ఒక మనిషీ కనిపించారు. గుంటలో ఉన్న వాళ్లు అతన్ని చూశారు.

పులి యజ్ఞదత్తుడితో, ‘‘మహాత్మా, ప్రాణ రక్షణను మించిన పుణ్యం లేదు. అందుచేత నన్ను బయటకి తీసి నా వారిని కలుసుకునేటట్టు చెయ్యి,’’ అన్నది.

‘‘నీ పేరు చెబితేనే ప్రాణులకు భయం కదా, నేను నిన్ను గుంటలోపలి నుంచి ఎలా పైకి తీయను?’’ అన్నాడు యజ్ఞదత్తుడు.

‘‘అయ్యా ఏ పాపానికైనా ప్రాయశ్చిత్తం ఉన్నది గాని, కృతఘ్నుతకు పరిహారం లేదు. నా గురించి నువు భయపడవలసిన పని లేదు. ప్రాణాపాయ స్థితిలో ఉన్న నన్ను జాలి దలిచి పైకి తియ్యి.’’ అన్నది పులి.

ప్రాణ రక్షణ యత్నంలో ప్రాణం పోయినా పుణ్యమే గదా అనుకుని ఆ బ్రాహ్మడు, వనలతలను బలమైన మోకుగా చేసి, దాని సహాయంతో పులిని పైకి లాగాడు.

‘‘అయ్యా నన్ను కూడా పైకి లాగు,’’ అని కోతి బతిమిలాడింది. పాము కూడా అలాగే కోరింది. బ్రాహ్మడు ఆ రెంటినీ గుంట నుంచి పైకి లాగాడు.





# వెనకచూపు



పూర్వం తూర్పుకనుమ ప్రాంతంలో కప్పలపాలెం అనే గ్రామం, దాని సరసనే ఒక కొండ ఉండేవి. కొండ కారణంగా వానలు బాగా కురవడం, చెరువులన్నీ ఏడాది పొడుగునా నీటితో నిండడం జరిగేది. కొండకు ఉత్తరాన ఉన్న పెద్దచెరువులో మండూకసేనుడనే కప్ప ఉండేది. దానికి చిన్నతనంనుంచీ కొత్త విషయాలు తెలుసుకోవాలనే కుతూహలం ఉండేది. అది సమయం దొరికినప్పుడల్లా ఆకాశంలో ఎగిరే పక్షులను చూసి అసూయపడుతూ ఉండేది. ''నేనుకూడా వాటిలాగా ఎగరగలిగితే ఎంత బాగుండును? అవి తాము చూసిన ప్రాంతాలన్నిటి గురించీ ఎన్నెన్ని వింతలూ, విషయాలూ చెపుతాయో గదా. కనీసం కొండ అవతల ఏముందోకూడా నిన్నమొన్నటిదాకా నాకు తెలియదు.''

ఈ పద్ధతిలో అస్తమానం మథనపడే మండూకసేనుణ్ణి పెద్దచెరువులోని తక్కిన జలచరాలు ఆటపట్టిస్తూ ఉండేవి. కొండకు అవతలి పక్క చిన్నచెరువు అనేదొకటి ఉందనీ, అందులో తాబేళ్ళు కూడా ఉంటాయనీ పక్షులు చెప్పుకోగా విన్న మండూకసేనుడికి ప్రపంచమంతా కాకపోయినా కనీసం చిన్నచెరువునైనా చూసి రావాలనే కోరిక బలంగా కలిగింది. దీన్ని గురించి అది కొందరు స్నేహితులకు చెప్పినప్పుడు వాళ్ళంతా గేలిచెయ్యడం తప్ప మరేమీ జరగలేదు.

''నువ్వెక్కడికి వెళతావు? నువ్వొక చిన్న కప్పవు. మహాఅయితే రెండు గంతులేస్తే ఒక అడుగు దూరం పోగలవేమో. కొండను దాటడం అంటే మాటలా? పగటికలలు మాని బుద్ధిగా చెరువులోనే హాయిగా ఉండు. పిచ్చివేషాలు వేశావంటే కొండ మీదున్న ఏ నక్కకో ఆహారమైపోతావు. రోగం కాస్తా కుదురుతుంది.'' అన్నారు వాళ్ళు.

వాళ్ళు నిరుత్సాహ పరుస్తున్నకొద్దీ మండూకసేనుడికి కొండ అవతలికి వెళ్ళి రావాలనే కోరిక మరింత బలపడుతూ వచ్చింది. మండూకసేనుడికి తన ప్రయాణం గురించిన ఆలోచనలు మొదలయాయి.

కొడవటిగంటి రోహిణీ ప్రసాద్

కొండ దాటనవసరంకూడా లేదు. కొండ శిఖరానికి చేరుకోగలిగితే చాలు. అవతలే ముందో స్పష్టంగా చూడవచ్చు.

విచిత్రమేమిటంటే అదే సమయానికి దక్షిణదిక్కులో కొండ అవతలున్న చిన్న చెరువులో నివసించే భేకవర్మ అనే మరొక కప్పకుకూడా ఇటువంటి కోరికే కలిగింది. పెద్దచెరువును గురించిన సమాచారం పక్షుల పిచ్చాపాటీద్వారా తెలుసుకున్న భేకవర్మకు అందులో పెరిగే తామరపువ్వులను చూడాలనే కుతూహలం పెరగసాగింది. అదీకాక పెద్దచెరువులో తాబేళ్ళనేవి ఉండవట. తిండి కోసం వాటితో పోటీపడే బాధకూడా ఉండదు. పైగా పెద్దచెరువు మన చిన్న చెరువుకు రెండింతలుంటుందట కూడానూ. అక్కడికి ఒక్కసారైనా వెళ్ళిరావలిసిందే. ఈ ప్రయాణం గురించి ఆలోచించడంతో భేకవర్మకు కంటిమీద కునుకు లేకుండా పోయింది. స్నేహితులు ఎంత నిరుత్సాహపరిచినప్పటికీ ఒక వెన్నెల రాత్రివేళ భేకవర్మ కొండ దాటేందుకు ప్రయాణం కట్టనే కట్టింది.

సరిగ్గా అదే సమయానికి అటువేపు నుంచి మండూకసేనుడి ప్రయాణంకూడా మొదలయింది. తాముండే చెరువులో మునకలేస్తూ, ఒడ్డున కాస్తంత మేర గంతులేసి వచ్చే కప్పలకు మైలున్నర దూరం ప్రయాణించడమంటే మాటలుకాదు. చీకటిలో ఈ కప్పలు రెండూ తలొకవేపు నుంచీ చెంగుచెంగున గెంతుకుంటూ కొండ సమీపానికి చేరుకున్నాయి. అంతకంతకూ పెరిగే చలికి తట్టుకుంటూ కప్పలు రెండూ ఒకే సమయానికి శిఖరాన్ని చేరుకున్నాయి.



తక్కిన విశేషాలు గమనించే లోపల అవి ఒకదాన్నొకటి చూసి ఆశ్చర్యపడ్డాయి.

భేకవర్మ ముందుగా ''అన్నా, తమరెవరు? ఈ సమయంలో ఈ కొండమీదికెందుకొచ్చారు?'' అని ప్రశ్నించింది. అవి రెండూ ఒకదాన్ని గురించి మరొకటి తెలుసుకున్నాయి. ''మా స్నేహితులెంత చెప్పినా చిన్నచెరువును చూడాలనే కోరికను చంపుకోలేక ఇలా వచ్చాను'' అని మండూకసేనుడు చెప్పడం భేకవర్మకు చాలా ఆనందం కలిగించింది.

భేకవర్మ ''చాలా సంతోషం అన్నా, అయితే ఇక నేను సెలవు తీసుకుంటాను. పెద్ద చెరువులోని తామరపువ్వులను చూడాలని ఎన్ని కలలు కన్నానో. ఇంకా మనం కొండ దిగి చాలాదూరం పోవాలికదా'' అనగానే మండూకసేనుడు ''తమ్ముడూ, ఇప్పటికే ఇన్ని గెంతులు గెంతి ఇంత దూరం వచ్చాం. ఒకపని చేద్దాం. ఈ శిఖరాన్నుంచే మీ చిన్న చెరువును నేను చూస్తాను, మా

పెద్ద చెరువును నువ్వు చూసెయ్యి. పనయి పోతుంది. కాస్త సేద తీరాక ఎవరింటికి వారు తిరిగిపోదాం. అనుకున్న చోటికి వెళ్ళ లేకపోయినా ఇప్పటిదాకా మనం పడ్డ శ్రమ వృథా కాదులే. ఏమంటావు?'' అని అడి గింది.

ఈ ఆలోచన భేకవర్మకు చాలా నచ్చింది. ''అన్నా, నువ్వెంతో అనుభవజ్ఞుడిలా ఉన్నావు. ఈ ఆలోచన నాకు రాలేదు సుమా. పెద్ద చెరువులోని తామరపువ్వులను దగ్గరికెళ్ళి వాసన చూడలేకపోయినా కనీసం కళ్ళారా చూసి ఆనందిస్తాను. అసలు కొత్త ప్రాంతా లను చూడకపోయినా వాటి గురించి మా మిత్రులకు వర్ణించి చెప్పడం బావుంటుంది. ఏమంటావు?'' అన్నది. దానికి మండూక సేనుడు ''బదులిస్తూ, నిజమే, చిన్నచెరువు తాబేళ్ళనూ, ఇతర విశేషాలనూ చూడాలని నాకుమాత్రం లేదా ఏమిటి? నేనుకూడా మీ చిన్నచెరువు ఒడ్డున తిరిగే తాబేళ్ళను ఇక్కణ్ణించే చూసి వెళతాను. క్షేమంగా ఎవ రింటికి వారు తిరిగిపోదాం'' అన్నది.

ఇలా నిర్ణయించుకున్నాక కప్పలు రెండూ తామున్నచోటునుంచే కొండ అవతలివేపుకు చూడడానికి ప్రయత్నించాయి. అయితే కప్పలు మరీ చిన్నవిగా ఉండడంతో అడ్డొచ్చిన బండరాళ్ళు తప్ప వాటికేమీ కనబడ లేదు. తమ శ్రమ అంతా వృథా అయిందని కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్న భేకవర్మను ఓదారుస్తూ మండూకసేనుడు ''తమ్ముడూ, విచారించకు. నేనొక ఉపాయం చెపుతాను. శిఖరంమీద ఒక కొనదేరిన రాయి ఉంది చూశావా? మనమిద్దరం దానిమీదికెక్కి, నిటారుగా సాగి నిలబడితే మనకు కింద నున్న దృశ్యాలన్నీ బాగా కనబడతాయి. ముందుగా మనం ఎలా నిలబడాలో తేల్చుకుందాం'' అన్నది.

ఈ ఆలోచన భేకవర్మకు చాలా నచ్చింది. అయితే కప్పలు వెనకకాళ్ళమీద నిలబడ



లేవు. వారిలో మళ్ళీ నిరాశ అలముకుంది. అయితే ఈసారి సమస్యకు ఉపాయం భేకవర్మకే తట్టింది. ''అన్నా, మనమిద్దరం ఎదురెదురుగా భుజాలు పట్టుకుని నిలుచుందాం. అప్పుడు ఒకరి భుజంమీది నుంచి మరొకరం అవతలేముందో చూసేద్దాం. ఏమంటావు?'' అన్నది.

ఇలా చేద్దామని నిశ్చయించుకున్న కప్పలు రెండూ కష్టపడి మొనదేరిన శిల అంచుకు చేరుకుని, కాలుజారి కిందపడి పోకుండా ఒకదాన్నొకటి పట్టుకుని నిలుచున్నాయి. అయితే కప్పలకు కళ్ళు ఎక్కడుంటాయంటే నిలబడిన ఏ కప్పకయినా కళ్ళు వెనక ఉన్న దృశ్యాన్నే చూడగలవు. ఇది అర్థం కాకపోవడంతో వాటికి ఏం జరుగుతోందో తెలియలేదు.

అవి నిలబడి ఉన్నప్పుడు ఎన్నడూ, దేన్నీ చూడలేదు. చిన్న చెరువువేపుకు ముఖం పెట్టి నిలుచున్న మండూకసేనుడికి తాను జీవితమంతా నివసించిన పెద్ద చెరువూ, పెద్దచెరువుకేసి చూస్తున్నాననుకున్న భేకవర్మకు తన స్వస్థలమైన చిన్న చెరువూ కనబడ్డాయి. కాలు జారుతుందనే భయంకొద్దీ అవి తొందరగా కిందికి దిగిరావలసివచ్చింది.

భేకవర్మ నిరుత్సాహంతో ''అన్నా, మరేమీ అనుకోకు. నీవుండేది పెద్దచెరువంటే అదేదో పెద్దదిగా ఉంటుందనుకున్నాను. సరిగ్గా మా చెరువంతే ఉంది. దాని ఒడ్డునకూడా తాబేళ్ళవంటివి తిరుగుతున్నట్టున్నాయి. పక్షులు చెప్పినవన్నీ అతిశయోక్తుల్లా అనిపిస్తున్నాయి'' అన్నది. మండూకసేనుడు నిరాశగా ''నాకూ అలాగే అనిపిస్తోంది. మీ చెరువు అంత చిన్నదేమీ కాదనుకుంటాను. తామరపువ్వులు కూడా కనబడటం లేదు. ఈ మాత్రందానికి కొండ దిగివెళ్ళడం కూడా అనవసరమే'' అన్నది.

ఈ విధంగా నిరుత్సాహపడ్డ కప్పలు రెండూ వెనుదిరిగి ఇంటిమార్గం పట్టాయి. భేకవర్మ ఈపాటి విశేషం చూడటానికి ఇంత శ్రమపడడం అనవసరమే అనుకున్నది. మరోవైపున మండూకసేనుడు కూడా, వృథా ప్రయాస మానుకోమని స్నేహితులు చెప్పిన సలహా సరైనదేనన్నమాట అనుకుంటూ కొండ దిగింది. నిలబడినప్పుడు తమకు ఉండేదల్లా వెనకచూపేనని వాటికి తెలియదు.

*(జపాన్ జానపద కథ అధారం)*





# దొంగ దొరికాడు!



కొమరయ్యా, చలపతీ అనే వాళ్లు బాల్య స్నేహితులు, వాళ్లు చిన్నతనంలోనే తమ గ్రామం వదలి, కోటగిరి అనే పెద్ద ఊరు చేరారు. అక్కడ కొమరయ్య కొబ్బరికాయల దుకాణం పెట్టాడు. చలపతి ఒక షావుకారి వద్ద గుమాస్తాగా చేరాడు. ఒకనాటి మధ్యాహ్నం వేళ చలపతి కొమరయ్య దుకాణానికి వచ్చి, ''కొమరయ్యా, నీ నుంచి ఒక సాయం కావాలి,'' అన్నాడు.

''ఏమిటది?'' అడిగాడు కొమరయ్య.

''మరేం లేదు. నా భార్య ఆడపిల్లను ప్రసవించినట్టు కబురు వచ్చింది. పిల్లను చూసేందుకు, మా అత్తవారి గ్రామం బయలుదేరాను. అయితే, అంతలో మరొక వార్త. మన గ్రామం వైపు ఉన్న ఏరు పొంగిందట. నన్ను చూసేందుకు వస్తున్న మా అమ్మా, నాన్నా ఇక్కడికి ఎప్పుడు చేరతారో తెలియదు. ఒకవేళ, వాళ్లు చీకటిపడి వస్తే, ఇంటికి తాళం వేసే ఉంటుంది గనక కష్టపడిపోతారు. ఈ రాత్రికి, మా ఇంట్లో పడుకో, నేను సూర్యోదయం వేళకు వచ్చేస్తాను,'' అంటూ చలపతి, కొమరయ్యకు తన ఇంటి తాళం చెవి ఇచ్చాడు.

''నువ్వు ఇంటి గురించి ఏమీ బెంగపడకు. ఈ రాత్రి కొంచెం ముందుగానే భోజనం చేసి, మీ ఇంటికి వెళ్లి పడుకుంటాను,'' అన్నాడు కొమరయ్య. చలపతి వెళ్లిపోయాడు. కొమరయ్య, ఆ రాత్రి ఇల్లు చేరేసరికి, అతడి భార్య మంచంలో ముసుగు పెట్టుకని మూలుగుతున్నది. ఆమెకు విపరీతమైన జ్వరం!

కొమరయ్య వెంటనే వెళ్లి, వైద్యుణ్ణి తీసుకు వచ్చాడు. ఆయన ఏదో మాత్రలు ఇచ్చి, తెల్లవారేలోపల రోగిచేత, మూడు సార్లు మింగించమన్నాడు. కొమరయ్యకు చలపతి ఇంటి విషయం గుర్తుకు వచ్చింది. అయితే, భార్యను ఒంటరిగా వదిలివెళ్లే పరిస్థితి కాదు! ఇప్పుడేం చేయాలి? అని ఆలోచిస్తున్న కొమరయ్యకు, చలపతి ఇంటికి ఎదురుగా ఉన్న ఇంట్లోకి, కొత్తగా అద్దెకు వచ్చిన ఆదిత్య అనే యువకుడు గుర్తుకు వచ్చాడు. అతను బ్రహ్మచారి.

**25 ఏళ్లనాటి చందమామ కథ**

కొమరయ్య, వెంటనే అతడి దగ్గిరకు వెళ్లి, సంగతి వివరంగా చెప్పి, ''నీకు ఇబ్బంది కలిగిస్తున్నాను. ఈ రాత్రికి చలపతి ఇంట్లో పడుకోగలవా?'' అని అడిగాడు.

అందుకు ఆదిత్య నవ్వి, ''ఇరుగూ పొరుగూ అన్నాక, ఈ మాత్రం సహాయ పడక పోతే ఎలా!'' అంటూ కొమరయ్య నుంచి చలపతి ఇంటి తాళం చెవి తీసుకు న్నాడు.

మర్నాటి సూర్యోదయం వేళకు కొమ రయ్య భార్యకు జ్వరం తగ్గింది. ఆదిత్య నుంచి తాళం చెవి తీసుకుందామని, కొమ రయ్య, చలపతి ఇంటికి వెళ్లాడు. అతను తలుపు తట్టేసరికి, దగ్గిరగా వేసి ఉన్న తలుపులు తెరుచుకున్నవి. లోపలి దృశ్యం చూసి నిర్ఘాంతపోయాడు కొమరయ్య.

ఆదిత్య ఒక స్తంభానికి కట్టివేయబడి ఉన్నాడు. ఇల్లంతా చిందరవందరగా ఉన్నది. కొమరయ్య, ఆదిత్య నోట్లో కుక్కి ఉన్న గుడ్డలు తీసి కట్లు విప్పాడు. ఆదిత్య ఒంట్లో ఏ మాత్రం సత్తువ లేని వాడిలా నేలమీద చతికిలబడిపోయాడు.

కొమరయ్య, అతణ్ణి, ''ఏం జరిగింది?'' అని అడిగాడు.

దానికి ఆదిత్య, ''ఒక రాత్రివేళ, తలుపు తట్టిన శబ్దం అయితే, చలపతి గారి తల్లి దండ్రులు వచ్చారేమో అని, తలుపు గడి తీశాను. చేత కత్తితో దొంగ ఒకడు లోపలికి వస్తూనే, కత్తిని నా గుండెలకు ఆనించి, స్తంభం దగ్గిరకు నడిపించి, నన్ను తాడుతో దానికి బిగించాడు. తర్వాత నేను అరవ బోయేసరికి, నోట్లో గుడ్డలు కుక్కాడు. నేను భయంతో, ఊపిరాడకా, అలా సొమ్మ సిల్లిపోయాను,'' అని చెప్పాడు.

ఇది విన్న కొమరయ్యకు నోట మాట రాలేదు. దొంగ ఏం ఎత్తుకుపోయి ఉంటాడో అని, అతడు చూస్తుండగా, చలపతి లోప లకు వస్తూనే, ''ఏం జరిగింది కొమరయ్యా?'' అని అడిగాడు.

కొమరయ్య జవాబు చెప్పబోయేంతలో



అతడు పక్కనున్న గదిలోకి పోయి, ఒక పెట్టె తెరిచి ఉంటడం చూసి, ''ఐదు వందల రూపాయలూ, వెండి వస్తువులూ అంతా దొంగల పాలయ్యింది!'' అంటూ కళ్లనీళ్లతో బయటకి వచ్చాడు.

కొమరయ్య, అతడికి ఆదిత్యను చూసి, జరిగిందంతా చెప్పాడు. చలపతి అంతా విని, ''ఇందులో మీ పొరబాటేమీ లేదు. అంతా నా ప్రారబ్ధం!'' అన్నాడు.

ఇది జరిగిన నాటి నుంచి, కొమరయ్య తప్పంతా తనదే అన్నట్లుగా బాధపడుతూ, తరచూ భార్యతో, ''నా అజాగ్రత్త వల్లనే, డబ్బూ, వెండి వస్తువుల విలువా కలిపి, దాదాపు రెండు వేల రూపాయల చలపతి ఆస్తి దొంగపాలయింది. అతడికి ఏదో కొంత ఇస్తే తప్ప, నాకు మనశ్శాంతి ఉండదు!'' అంటూండేవాడు. ఇటువంటిసమయంలో, కొమరయ్యకు దూరపు బంధువైన జనార్ధనం అనే అతను ఆ ఊరికి రక్షక భటుల అధికారిగా వచ్చాడు. ఆ వచ్చిన రోజు రాత్రే, అతడు కొమరయ్య పిలవగా, అతడింటికి భోజనానికి రావడం జరిగింది. కొమరయ్య మాటల సందర్భంలో, చలపతి ఇంట జరిగిన దొంగతనం గురించి అతడికి చెప్పాడు.

జనార్ధనం అంతా విని, ''ఇంతకూ, ఆ ఆదిత్య అనే అతను నమ్మదగిన వాడేనా?'' అని అడిగాడు.

''అతను కొత్తగా, చలపతి ఇంటి దాపుల ఉన్న ఇంట్లోకి అద్దెకు వచ్చాడు. అతడి మంచి చెడ్డల గురించి, నాకేం తెలియదు.'' అన్నాడు కొమరయ్య.

జనార్ధనం ఒకటి, రెండు క్షణాలు ఆలోచిస్తూ ఊరుకుని, ''దొంగ ఆదిత్యను తాడుతో స్తంభానికి కట్టివేశాడు గదా! దాని ముడి ముందు వైపున ఉన్నదా లేక వెనక వైపు ఉన్నదా?'' అని ప్రశ్నించాడు.

కొమరయ్య వెంటనే ''నాకు బాగా గుర్తు! తాడు ముడి సరిగ్గా ఆదిత్య పొట్టమీద ఉన్నది,'' అన్నాడు.



ఆ జవాబుకు జనార్ధనం నవ్వి, ''ఇకనేం, దొంగ ఆదిత్యే! వాడు తనను తాను స్తంభానికి కట్టుకున్నాడు గనకే, తాడు ముడి ముందు ఉన్నది. దొంగ అయితే, వాడి చేతికి అందకుండా వెనక ముడి వేస్తాడు. ఇంకో సంగతేమిటంటే, దొంగ అయిన వాడెవ్వడూ, ఒక మనిషిని స్తంభానికి కట్టి, ఇంటి తలుపులు దగ్గిరకు వేసి పోడు. బయటినుంచి గొళ్లెం పెడతాడు,'' అని చెప్పాడు.

''అంతా బాగానే ఉన్నది. మరి, ఆదిత్య దొంగ అని రుజువు చేయడం ఎలా?'' అని అడిగాడు కొమరయ్య.

జనార్ధనం, అతడికి ఏం చేయాలో చెప్పి వెళ్లిపోయాడు. మర్నాడు కొమరయ్య, ఆదిత్యను కలుసుకుని, ''చలపతి, తన ఇంట జరిగిన దొంగతనం గురించి, లోగడ కచేరీలో ఫిర్యాదు చేశాడు. రాత్రి గస్తీ తిరుగుతున్న రక్షకభటులకు, దొంగ ఒకడు దొరికాడు. కాని, వాడు పిచ్చివాడిలా ప్రవర్తిస్తున్నాడట. ఇది నటనేమో అని వాళ్ల అనుమానం. నువ్వు కచేరీకి వచ్చి, వాణ్ణి చూసి గుర్తు పట్టాలి,'' అన్నాడు.

కొమరయ్యతో కచేరీకి వెళ్లిన ఆదిత్య, అక్కడ పిచ్చి చూపులు చూస్తున్న మనిషిని చూస్తూనే, ''వీడే, ఆ రాత్రి కత్తి చూపి నన్ను స్తంభానికి కట్టి, చలపతి గారిల్లు దోచుకున్న దొంగ, ఎలాగైతేనేం, దొంగ దొరికాడు!'' అన్నాడు.

ఆ వెంటనే, పిచ్చివాడిలా నటిస్తున్న జనార్ధనం, ఒక్క దూకున వచ్చి, ఆదిత్య మెడ వడిసి పట్టుకుని, ''దొంగ దొరికిన మాట నిజం. అయితే ఆ దొంగవు నువ్వే! తేళ్లూ, జెర్రులూ పాకే చీకటి కొట్లో వేయమన్నావా? లేక నిజం ఒప్పుకుని దొంగిలించిన సొమ్ము తెచ్చి ఇస్తావా?'' అన్నాడు.

ఆదిత్య నిలువెల్లా వణికిపోతూ, నేరం ఒప్పుకున్నాడు. ఒక రక్షక భటుడు వెంట రాగా, ఇంటికిపోయి దొంగిలించిన సొమ్ముతో కచేరీకి తిరిగి వచ్చాడు. అయితే, వెండి వస్తువులన్నీ అలాగే ఉన్నవి. కాని, ఐదు వందల రూపాయల నగదులో వంద రూపాయలు ఖర్చయిపోయినై.

జనార్ధనం అతణ్ణి కటకటాలకు వెనుక ఉన్న గదిలో ఉంచమని రక్షకభటులకు చెప్పి, చలపతికి కబురు చేశాడు.

చలపతి పోయిన సొమ్ము దొరికినందుకు చాలా సంతోషించి, ''ఇదంతా, మా అబ్బాయి పుట్టిన వేళా విశేషం!'' అన్నాడు.

– మాచిరాజు కామేశ్వరరావు





# ఉత్తమదానం



పద్మనాభుడనే అతనికి, ధర్మవరం గ్రామంలో పెద్ద కిరాణా కొట్టున్నది. సరసమైన ధరలకు సరకులను అమ్ముతూ, నాణ్యత విషయంలో రాజీ పడేవాడు కాడు. గ్రామంలో ప్రజలందరి నమ్మకం పునాదిగా వ్యాపారాన్ని సజావుగా నిర్వహించుకుంటూ అతడు మంచి పేరు తెచ్చుకున్నాడు.

పద్మనాభుడు ఒకసారి, వ్యాపారం పనిమీద, యలమంచిలి అనే ఊరు వెళ్లి, పని ముగించుకుని తిరిగి తన ఒంటెద్దు బండిమీద ధర్మవరం వస్తున్నాడు.

బండి యలమంచిలి దాటాక, పద్మనాభుడికి, ఒక వ్యక్తి దారిలో వస్తూ కనిపించాడు. అతను పద్మనాభుణ్ణి చూస్తూనే, గబగబా బండిదగ్గిరకు వచ్చి, ''మాది ఈ దారిలోనే ఉన్న పురుషోత్తపురం. దయ ఉంచి నాకు మీ బండిలో కాస్త చోటిస్తారా?'' అని అడిగాడు.

పద్మనాభుడు, ఆ వ్యక్తిని యలమంచిలిలోని, ఒక అంగడిలో చూశాడు. ఇద్దరూ, ఆ అంగట్లో జీడిపప్పు కొన్నారు.

అపరిచితుడే అయినప్పటికీ అతను బండిలో ఉంటే కొంత ఊసు పోతుందని ఆలోచించి, పద్మనాభుడు అతణ్ణి బండి ఎక్కమన్నాడు. ఆ వ్యక్తి బండిలో ఎక్కి కూర్చున్నాడు. బండివాడు శరభుడు, బండిని తోలడం ప్రారంభించాడు.

మాటల సందర్భంలో, ఆ వ్యక్తి పేరు రంగరాజు అనీ, పురుషోత్తపురంలో తనకున్న మూడెకరాల మాగాణి భూమిపై వ్యవసాయం చేసుకుని జీవిస్తున్నాడని, పద్మనాభుడు తెలుసుకున్నాడు.

దారిలో కనిపించి చేయిచాచిన యాచకుల చేతిలో చిల్లర డబ్బులు వేయసాగాడు పద్మనాభుడు. రంగరాజు మాత్రం, తన దగ్గిర చిల్లర లేదని వాళ్లను పొమ్మనసాగాడు.

ఎస్.వి.ఆర్. సత్యనారాయణమూర్తి

ఇది చూసి పద్మనాభుడు, ‘‘రంగ రాజుతో, ‘‘రంగరాజుగారూ! నేను ఎంతో కొంత అడిగినవాళ్లకు లేదనకుండా ధర్మం చేస్తుంటాను. అవసరం అయితే మన కోరికలను అదుపులో పెట్టుకుని మనకు ఉన్నదానిలో కొంత దానధర్మాలు చేయాలి. అప్పుడే, మనిషికి జన్మసార్థకత!’’ అని అన్నాడు.

ఇంతలో బండి చక్రం సీల జారి కింద పడింది. అది గమనించిన శరభుడు, బండి ఆపి, దాన్ని నెమ్మదిగా దారి పక్కకు లాగించాడు.

తర్వాత సీల కదలకుండా దిగెయ్యడా నికి రాయి కోసం వెతుకుతూ దూరంగా వెళ్లాడు.

పద్మనాభుడూ, రంగరాజూ బండిదిగి ఎండ బాగా కాస్తుండటంతో ఒక చెట్టు నీడలో నిలబడ్డారు. ఇంతలో అక్కడికి ఒక బక్క చిక్కిన ముసలివాడు వచ్చాడు. వాడి కళ్లు లోతుకు పోయి ఉన్నాయి. చేతిలో ఒక కర్ర ఉన్నది.

వాడు ఖరీదైన దుస్తులలో ఉన్న పద్మ నాభుణ్ణి చూసి, ‘‘బాబూ, రెండు రోజు లుగా తిండిలేదు. తినడానికేమయినా ఉంటే పెట్టించండి.’’ అన్నాడు ఎంతో దీనంగా.

వెంటనే పద్మనాభుడు, ‘‘ఈ రహ దారిలో తినడానికేం దొరుకుతుంది. దగ్గరలో పురుషోత్తపురం అనే ఊరు ఉన్నది కదా! అక్కడికి వెళితే, ఏ పూట కూళ్లమ్మ ఇంటనో భోజనం దొరుకు తుంది. డబ్బులిస్తాను. తీసుకుపో,’’ అన్నాడు.

ఇది విన్న రంగరాజు, బండి దగ్గిరకు వెళ్లి, తన సంచీలోంచి జీడిపప్పుల మూట తీసుకుని, చెట్టుదగ్గిరకు తిరిగి వచ్చి,



మూటను ముసలివాడికిస్తూ, ''తాతా, ఇందులో జీడిపప్పులున్నవి. ఇవి తిన్నా వంటే ఆకలి కొంత తీరుతుంది. తిని, నీళ్లు తాగు,'' అన్నాడు.

ముసలివాడి కళ్లు నీళ్లతో నిండాయి. వాడు, రంగరాజుతో, ''బాబూ, జీడిపప్పు చాలా ఖరీదని విన్నాను. అప్పుడప్పుడూ తినాలన్న కోరికతో, మీరు చాలా ఖర్చు చేసి ఇంత జీడిపప్పు కొని ఉంటారు. వాటిని నేను తీసుకోవడం ధర్మం కాదు. వద్దు బాబూ!'' అన్నాడు.

''ఫర్వాలేదు, తాతా! ఆకలితో ఉన్న నీకు, ఏదో కొంత ఆకలి తీర్చానన్న సంతృప్తి నాకు కలిగించు. కోరికల్ని అదుపులో పెట్టుకుంటేనే, మనిషి జన్మ సార్థకత అని, ఈ బాబుగారు ఇంతకుముందే నాకు చెప్పారు,'' అని పద్మనాభుణ్ణి చూపించాడు రంగరాజు.

ముసలివాడు, రంగరాజుకు దణ్ణం పెట్టి, ''బాబూ, నా పళ్లు ఇంకా గట్టిగానే ఉన్నాయి. ఎప్పుడో ఏదో కొద్దిగా ఇన్ని జీడిపప్పులు తినడం తప్ప, ఇంత జీడిపప్పు తినడం, నా జన్మలో ఇంతవరకూ జరగలేదు, మీ మేలు మర్చిపోలేను.'' అంటూ సంతోషంగా మూటవిప్పి అందులోని జీడిపప్పులు తింటూ వెళ్లిపోయాడు.

ఆకలితో అలమటిస్తూ వచ్చిన వాడి ముఖంలో కనిపించిన సంతోషం చూసి, పద్మనాభుడు ఆలోచనలో పడ్డాడు. తాను చేసే రకరకాల దానధర్మాలకన్నా, రంగరాజు చేసిన దానం ఎంతో ఉత్తమమైనదిగా ఆయనకు కనిపించింది.

రంగరాజు తన కోరికను చంపుకుని, ఆకలిగొన్న వాడి బాధ తీర్చాడు. కాని, నేనాపని చేయలేకపోయాను. పరులకు నీతులు చెప్పడం కంటే మనం వాటిని



ఆచరించడం చాలా కష్టం - అని విచారించాడాయన.

అంతవరకూ, తను చాలా తేలిక భావంతో చూస్తున్న రంగరాజు, ఎంతో ఉత్తముడనుకుంటూ, పద్మనాభుడు, అతడితో, ''రంగరాజుగారూ, ఇది నాకు కొంత ఆశ్చర్యంగా తోస్తున్నది. ఇద్దరం ఒకే దుకాణంలో, ఒకే సమయంలో జీడిపప్పులు కొన్నాం!'' అన్నాడు.

అందుకు రంగరాజు చిరునవ్వు నవ్వి, ''నా భార్య నిండు గర్భిణి. ఆమె కోరిక మేరకు జీడిపప్పు కొని తీసుకుపోతున్నాను. అంతే గాని, మామూలుగా జీడిపప్పు కొనేంత తాహతు ఉన్నవాణ్ణి కాదు.'' అన్నాడు వినయంగా.

తర్వాత రంగరాజు, అక్కడికి సమీపంలో ఉన్న నూతి దగ్గిరకు పోయి, ముఖం కడుక్కుని, మంచినీళ్లు తాగి తిరిగి వచ్చాడు.

అతడు తిరిగి వచ్చేసరికి బండి సిద్ధంగా ఉన్నది. దారిలోని పురుషోత్తపురంలో బండి దిగిన, రంగరాజు పద్మనాభుడికి కృతజ్ఞతలు తెలిపి ఇంటికి వెళ్లాడు.

అతడి భార్య, భర్తకు ఎదురు వచ్చి సంచీ అందుకుని, ''జీడిపప్పు కొని తెచ్చారా?'' అని అడిగింది.

రంగరాజు లేదన్నట్టు తలాడించి భార్యకు దారిలో జరిగినదంతా చెప్పాడు. ఆమె అంతా విని ''అలాగా!'' అంటూ సంచిలో ఉన్న ఇతర పచారీ సరుకుల పొట్లాలు తీసి బయటపెడుతూ ఆశ్చర్యంగా, ''అదేమిటండీ, సంచీలో జీడిపప్పు మూట ఉన్నది గదా!'' అని మూట భర్తకు చూపింది.

రంగరాజు కూడా ఆశ్చర్యపోయి ఒకటి రెండు క్షణాలు ఆలోచిస్తూ ఊరుకుని, ''ఆ పద్మనాభుడు చాలా మంచివాడు. ముసలాయన ఆకలి తీర్చిన తరవాత నేనెవరికోసం, ఆ జీడిపప్పు కొన్నానో అడిగి తెలుసుకున్నాడు. తర్వాత, నేను బావి దగ్గరకు మంచినీళ్లకోసం పోయినప్పుడు, తాను కొన్న జీడిపప్పు, నా సంచిలో పెట్టాడు!'' అన్నాడు.





# రాజు దిగులు



మగధ దేశాన్ని ఏలే జయసింహుడు, ఒకనాటి రాత్రి అలవాటు ప్రకారం తన సలహాదారుడైన గుణనిధితో మారు వేషంలో సంచరిస్తుండగా, నగరం శివార్లలో, కొందరు బందిపోటు దొంగలు వాళ్లను అటకాయించారు.

రాజూ, సలహాదారూ దొంగల మీద కత్తులు దూశారు. అయితే, దొంగలు వాళ్లను చుట్టుముట్టి నిరాయుధుల్ని చేశారు. వాళ్లవద్ద ఎలాంటి ధనం లభించక పోవడంతో, దొంగలు కోపగించుకుని, దుర్భాషలాడి వదిలేశారు.

ఆ మర్నాడు జయసింహుడు కొలువ తీరిన సభలో, దొంగలు చేసిన అవమానం తలుచుకుని దిగులుగా కూర్చున్నాడు. కొంతసేపు తర్వాత రాజు సభికులతో, ''ఈ సభలో ఎందరో మేధావులు ఉన్నారు. నాకొక సందేహం కలిగింది. దానికి మీరే సమాధానం చెప్పాలి: ఒక మనిషి విలువ, అతడి రూపం, వేషం బట్టి ఉంటుందా? ఒకచోట గౌరవించబడిన మనిషి, మరొక చోట అవమానించబడతాడు, దీనికి కారణం ఏమిటి?'' అన్నాడు.

ఒక పావుగంట కాలం గడిచినా, సభికులెవ్వరూ రాజు సందేహానికి సమాధానం చెప్పేందుకు లేవలేదు. రాజు దిగులు పోగొట్టడానికి ఇదే మంచి సమయమని భావించిన గుణనిధి లేచి, ''మహారాజా, ఏ వ్యక్తి విలువ అయినా, అతడు అలంకరించిన స్థానం, అతడి వేషం బట్టి మారుతుంటుంది,'' అన్నాడు.

''మారుతూ ఉంటుందని ఊరికే చెప్పడం కాదు; దృష్టాంతం చూపి నిరూపించగలరా?'' అని ప్రశ్నించాడు రాజు.

''నిరూపించగలను, మహారాజా!'' అని గుణనిధి ఒక వస్త్రాన్ని తీసుకుని తలకు చుట్టుకుని, సభలో ఒకరిని, ''ఇదేమిటి?'' అని అడిగాడు.

పెంటకోట సోమినాయుడు

''తలపాగా!'' అన్నాడు సభికుడు.

అదే వస్త్రాన్ని గుణనిధి, భుజం మీద వేసుకుని, అదే సభికుణ్ణి, ''ఇదేమిటి?'' అని ప్రశ్నించాడు.

''ఉత్తరీయం!'' అన్నాడు సభికుడు.

గుణనిధి, ఆ వస్త్రాన్ని చేతితో పట్టుకుని, ''ఇదేమిటి?'' అని ప్రశ్నించాడు.

''తుండుగుడ్డ!'' అన్నాడా సభికుడు.

అప్పుడు గుణనిధి, రాజుతో, ''చూశారా, మహారాజా! నిజానికి నా చేతిలో ఉన్నది వస్త్రం. కాని, అది స్థానం మారినప్పుడల్లా దానికి తగినట్లుగా తన పేరు మార్చుకుంటూ పోయింది. మరింత సుబోధకం కావాలంటే మరొక నిదర్శనం చూపిస్తాను చూడండి,'' అని సభలో నుంచి బయటకు పోయి, ఒక కొయ్య ముక్కను పట్టుకుని తిరిగి వచ్చాడు.

అతడు, ఆ కొయ్య ముక్కను, సభలో ఒక సభికుడి ముందు పెట్టి, కాలితో తన్నమన్నాడు. సభికుడు అలాగే చేశాడు. తర్వాత గుణనిధి, ఆ కొయ్య ముక్కను అక్కడే ఉన్న ఆస్థాన శిల్పి చేత, దేవుడి విగ్రహంలా చెక్కించాడు. ఆ పని ముగిశాక, అతడు, అదే సభికుడి ముందు ఆ కొయ్య విగ్రహాన్ని పెట్టి, మరొకసారి కాలితో తన్నమన్నాడు. కాని, సభికుడు వణికిపోతూ, లెంపలు వాయించుకుని, భక్తితో ఆ విగ్రహానికి నమస్కరించి అక్కడి నుండి దూరంగా వెళ్ళిపోయాడు.

గుణనిధి, రాజుతో, ''గమనించారా, మహారాజా! దేవుడు లేనిచోటంటూ ఉండదంటారు. అంటే, కొయ్యముక్కలో కూడా దేవుడున్నట్టే గదా, కాని, ఆ కొయ్య ముక్క దేవుడి రూపం ధరించిన తర్వాత మాత్రమే, దాన్ని ఎవరైనా దేవుడిగా గుర్తించి పూజిస్తారు. అలాగే, రాజలాంఛనాలతో ఉన్న మిమ్మల్ని మహారాజుగా గుర్తించి గౌరవించే ప్రజలే, సామాన్యుడిలాగా ఉన్న మిమ్మల్ని గుర్తించలేక ఒక్కోసారి అగౌరవపరచవచ్చు!'' కూడా అన్నాడు.

గుణనిధి మాటలు అర్థం చేసుకున్న జయసింహుడు, తృప్తిగా చిరునవ్వు నవ్వాడు. ఆయన మనసులోని దిగులు, ఆ క్షణంలోనే మటుమాయమైంది.



# శిథిలాలయం - 8




(సవరగండుపోతు, శివాలుడికి శిథిలాలయ పూజారి దాగి ఉన్న కొండ గుహ సంగతి తెలియజేశాడు. శిఖిముఖీ, విక్రమకేసరీ కొండ ప్రాంతాలకు వెళ్లారు. శిఖిముఖి గుహలో కదులుతున్న ఆకారానికేసి గురి చూసి బాణం వదిలాడు. బాణం దెబ్బ తింటూనే గుహలోని ఆకారం ఎలుగుబంటులా పెద్దగా గోండ్రించి బయటికి దూకింది. తరవాత..)

శిఖిముఖి చెట్టు మీదినుంచి దిగి గుహను చేరేసరికి, విక్రమ కేసరీ అతడి వెంట ఉన్న వాళ్లూ, పెద్దగా కేకలు పెడుతూ, ఎలుగు బంటును వెంటబడి తరుముతున్నారు. బాణం దెబ్బ తింటూనే ఎలుగు బంటు గుహ నుంచి బయటికి వచ్చి, కొండ దిగి పారిపోయేందుకు ప్రయత్నించింది.

''కేసరీ! ఆ ఎలుగ్గొడ్డును పట్టుకునేందుకు ఎందుకంత శ్రమపడుతున్నావ్? ముందు గుహలో ఆ పూజారిగాడున్నాడేమో చూడటం అవసరం,'' అన్నాడు శిఖిముఖి విక్రమకేసరిని సమీపిస్తూ.

ఆ మాటలు వింటూనే గండుపోతు అనుచరులైన సవరలు ''ఇంకెక్కడి పూజారి! మనను మోసగించేందుకు వాడే ఇలా ఎలుగుబంటుగా మారిపోయాడు. వాణ్ణి ఈ ఆకారంలోనే పట్టుకుని నిలువునా భస్మం చేసేద్దాం,'' అన్నారు.

శిథిలాలయ పూజారి కున్నవని చెప్పబడే అపూర్వ శక్తుల్లో శిఖిముఖికి రవంత నమ్మకం ఉన్నది. తాటి చెట్టు పైనుంచి దిగి వచ్చేప్పుడు అతడూ, గుహలో ఉన్నది ఎలుగ్గొడ్డుగా మారిపోయిన పూజారి అయి ఉండొచ్చనుకున్నాడు.

అలాంటప్పుడు, ఈ అమాయకులైన సవర యువకులు ఎలుగుబంటును పూజారి అని భ్రమపడటంలో పెద్దగా ఆశ్చర్యపడవలసిందేమీ లేదు.

దాసరి సుబ్రహ్మణ్యం

శిఖిముఖి ఇలా ఆలోచించి, ఎర్రగండును ఎలుగుబంటి మీదికి ఉసికొలుపుతూ, ''కేసరీ, మీరు ఎలుగును పట్టుకోండి గండుపోతు ముఠావాళ్లు అన్నట్టు అది పూజారి అయినా కావచ్చు. అయినా కాక పోయినా వాళ్లకు మనం కోపం తెప్పించటం ఎందుకు? నేను ఈలోపల గుహలోకి పోయి, ఆ దుర్మార్గుడు చీకట్లో ఎక్కడైనా నక్కి ఉన్నాడేమో చూస్తాను,'' అని చెప్పి గుహ లోకి వెళ్లాడు.

గుహలో జాగ్రత్తగా పరీక్షించిన మీదట శిఖిముఖికి, శిథిలాలయ పూజారి అందులో కొన్నాళ్లపాటు ఉన్న గుర్తులు కనిపించేనై. గుహలో ఒక మూలగా పులిచర్మం ఒకటి పరిచి ఉన్నది.

మరోమూల వంట చేసుకునేందుకు సిద్ధంగా ఉంచిన పొయ్యీ, కొన్ని పాత్రలూ కనిపించినై. పొయ్యి పక్కనే చమురుతో బాగా తడిపి ఉన్న రెండు దివిటీలు బండ రాళ్లకు ఆనించబడి ఉన్నవి.

ఇవి తప్పిస్తే పూజారి గుహ నుంచి పారి పోయేందుకు మరే రహస్య ద్వారం ఉన్న సూచనలూ శిఖిముఖికి కనిపించలేదు. కారణమేదైనా గావచ్చు. అతడు ఇప్పటికి చాలా గంటల క్రితమే గుహ వదిలిపో యాడు. తప్పించుకునే ప్రయత్నంలో ఎలుగ్గొడ్డును మహా తెలివిగా ఇందుకు ఉపయోగించుకున్నాడు.

దొరికినట్లే దొరికి తప్పించుకున్న శిథిలా లయ పూజారి జిత్తులమారి తనానికి శిఖి ముఖి అబ్బురపడుతూండగా గుహ బయటి నుంచి విక్రమ కేసరి పిలుపు వినిపించింది. శిఖిముఖి వెంటనే బయిటికి వచ్చాడు.




ఎలుగ్గొడ్డును ఎత్తైన రాళ్ల మధ్యకు తరిమి సవరలు దాని మెడకు తాడు తగిలించేం దుకు తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. మరో వైపున ఎర్రగండు రాళ్ల మధ్య ఉన్న ఒకే ఒక ఇరుకు దారినుంచి అది బయిటికి పారిపో కుండా, అక్కడ నిలబడి దిక్కులదిరేలా పెద్దగా మొరుగుతున్నది.

విక్రమకేసరి, శిఖిముఖి దగ్గిరకొచ్చి చిన్నగా ''శిఖీ! ఈ నల్లమొద్దు శిథిలాలయ పూజారి కానే కాదని నాకూ తెలుసు, కాని సవరల మూఢ విశ్వాసాన్ని తృణీకరిస్తే మనకు కొన్ని అనవసర చిక్కులు ఎదురయ్యే ప్రమాదం ఉన్నది. పైగా వీళ్లు తమ నాయ కుడైన గండుపోతుతో, ఎలుగుబంటుగా మారిన పూజారిని మనమే చేజేతులా జారవిడిచామని చెప్పి తీరుతారు. అతడికి పూజారి మంత్రశక్తుల్లో పూర్తి విశ్వాసం ఉన్నట్లు కనబడుతుంది,'' అన్నాడు.

''ఆ దుర్మార్గుడి వల్ల చిక్కుల్లో పడింత రువాత గండుపోతుకు అతడి మీద నమ్మకం

పోయి, ద్వేషభావం కలిగిందని నేననుకుం టున్నాను. ఏమైనా, కొండ కింద నుండి పూజారి గుహను కాపలా కాస్తున్న వాళ్లకు, వాడు బయటికి పోయిన సంగతి గాని, ఈ ఎలుగుబంటి లోపల ఉన్న విషయం గాని తెలియదు.

అందువల్ల మనం దీన్ని పట్టుకుపోయి, మా అయ్యకూ, గండుపోతుకూ చూపటం మంచిది. ఆ తరవాత అరణ్యంలో పూజారి గాడి వేట మళ్ళీ ప్రారంభిద్దాం,'' అన్నాడు శిఖిముఖి.

శిఖిముఖి ఎలుగుబంటు ఉన్న చోటుకు పోయి, రాళ్లమీది నుంచి దానికేసి చూశాడు. అది పెద్దగా గోండ్రిస్తూ పారిపోయేందుకు ప్రయత్నిస్తున్నది.

శిఖిముఖి చుట్టూ కలియ చూసి, అల్లంత దూరంలో ఉన్న పొదల మీది అడివితీగల్ని కోసుకు వచ్చి, వాటిని తాడుగా పేని, ఉచ్చు వేసి దానిని ఎలుగుబంటి మెడ మీదికి గురిగా విసిరాడు.

అది ఎలుగుబంటి మెడకు తగులుకో గానే ఉచ్చు గొంతుకు బిగిసేలా రెండు చేతులతో బలంగా లాగాడు. ఎలుగు బంటు మరింత పెద్దగా గోండ్రిస్తూ చేతు లతో తాడును తెంచేందుకు ప్రయత్నిం చింది. శిఖిముఖి హెచ్చరించగానే, విక్రమ కేసరితో పాటు, ఇద్దరు సవరులు అతడి చేతిలో ఉన్న తాడును గట్టిగా పైకి గుంజారు.

ఎలుగుబంటి ఆ గుంజుడు వేగానికి ఒకటి రెండడుగులు నేల మీది నుంచి పైకి లేచింది. శిఖిముఖి అదే అదునుగా దాని మూతికి ఒక అడివితీగను గట్టిగా రెండు చుట్లు చుట్టి ముడివేసేశాడు.




శిఖిముఖీ, విక్రమకేసరీ కలిసి ఎలుగు బంటును రాళ్లమధ్య నుంచి బయటకి లాగి, దాని మెడకు బిగిసి ఉన్న తాడును సవరలకు ఇచ్చి, ''ఇక తిమ్మగూడేనికి పదండి, ఇది అడవిగొడ్డో, లేక శిథిలాలయ పూజారో మీ నాయకుడు సవరగండే తెలు స్తాడు,'' అని చెప్పారు.

వాళ్లు ఎలుగుబంటితో గూడేన్ని చేరే సరికి, అక్కడ స్త్రీలూ, పిల్లలూ గుంపు లుగా పోగై, ''పూజారి ఎలుగు! పూజారి ఎలుగు!'' అని కేకలు పెడుతూ, వాళ్లతో పాటు శివాలుడూ, సవర గండుపోతూ ఉన్న గ్రామచావడికి వచ్చారు.

శివాలుడు ఈ గందరగోళం ఏమిటా అని చావడిలోంచి బయటికి వచ్చి, తన కొడుకునూ, ఎలుగుబంటునూ చూస్తూనే, ''ఏమిటిది? ఆ దుర్మార్గుడు పూజారి గుహలో లేడా?'' అని ప్రశ్నించాడు.

''పూజారి గుహలో నుంచి ఎప్పుడో పారి పోయాడు. ఆ సంగతి కాపలావాళ్లకు తెలి

యకుండా ఉండేందుకు ఈ ఎలుగుబంటును గుహలో కట్టివేశాడు,'' అని శిఖిముఖి అక్కడ జరిగినదంతా తండ్రికి చెప్పి, ''గండుపోతు కులంవాళ్లకు ఈ ఎలుగే శిథిలాలయ పూజారి అన్న నమ్మకం ఉన్నది. అందుకనే దీన్ని ఇక్కడికి పట్టుకొచ్చాం. గండుపోతు కూడా దీన్నోసారి చూడటం బావుంటుంది. అతడు చెప్పితే తప్ప, అతడి మనుషులకు నమ్మకం కలగదు,'' అన్నాడు.

ఈ లోపల గండుపోతును అతడి అనుచరులిద్దరు భుజాలు పట్టుకుని చావిడి బయటకు తీసుకువచ్చారు. అతడు తన అనుచరులు చెప్పినదంతా విని, ఎలుగుబంటుకేసి గుచ్చి గుచ్చి చూస్తూ, ''ఆ పూజారి కుక్క ఎంతకైనా సమర్థుడే, ఎందుకైనా మంచిది. ఈ మెకాన్ని ఇంటికి తీసుకుపోయి, నా కూతురు నాగుమల్లికి ఒప్పచెప్తాను. మల్లి ఈటే, కత్తీ తీసుకున్నదంటే, ఇది నిజం చెప్పి తీరుతుంది!'' అని తన అనుచరుల కేసి తిరిగి, ''మన జాగ్రత్తలో మనం ఉండాలి. ఒక వేళ ఆ పూజారి-కుక్క అరణ్యంలోనే తిరుగుతూండొచ్చు. మన గూడేలన్నిటికీ కబురందించి, ఆ దుష్టుణ్ణి పట్టుకునేందుకు ప్రయత్నం చెయ్యండి,'' అన్నాడు.

గండుపోతు అనుచరులు ఎలుగుబంటును వెంట తీసుకుని అక్కణ్ణించి వెళ్ళిపోగానే శివాలుడు స్నేహపూర్వకంగా సవరగండుపోతు భుజం తట్టి, ''గండుపోతూ! ఇక మేం మా పల్లెలకు వెళతాం. పూజారి మనకూ మనకూ అనవసర విరోధం తెచ్చిపెట్టాడు. అదంతా మరిచిపోదాం. నీ గాయాలు మాని త్వరలో ఆరోగ్యం కలుగుతుందని నమ్ముతున్నాను. నా కొడుకు తొందరపాటుకు విచారిస్తున్నాను,'' అన్నాడు.

ఆ మాటలకు గండుపోతు బిగ్గరగా నవ్వి, ''తొందరపాటా! ఆ వయసుకు ఆ మాత్రం తొందరపాటు లేకపోతే, పెరిగి పెద్దయింతరవాత ఎందుకు పనికొచ్చేట్టు? నేనూ వయసులో ఉండగా కాబోయే మామ



మీద ఇలాంటి మోటు సరసమే ఆడాను. నా కూతురు నాగుమల్లితో పోలిస్తే, నీ కొడుకు శిఖిముఖి ఎంతో మేదకుడుగా కనిపిస్తాడు. మీరంతా మా గూడేనికి వచ్చి రాత్రికి నేనిచ్చే విందుభోజనం తినాలి. ఈ లోపల, ఆ పూజారి కుక్క ఎక్కడ ఉన్నదీ తెలిసినా తెలియొచ్చు,'' అన్నాడు.

ఈ ఆహ్వానం అంగీకరించటమా, మాన టమా అన్నట్లు శివాలుడు, తన కొడుకు కేసి, విక్రమకేసరి కేసి చూశాడు. వాళ్లిద్దరూ ఏ భావం కనబరచలేదు. కాని, ఆ ఇద్దరి కళ్లూ గండుపోతు మీదే ఉన్నవి. అతడు మరేదైనా కుతంత్రం పన్నుతున్నాడేమో అన్న అనుమానం వాళ్లను పీడిస్తున్నది.

శివాలుడి ఆలోచన గ్రహించిన వాడిలా సవరగండుపోతు తలాడిస్తూ, ''ఒక కుల పెద్ద విందుకు ఆహ్వానిస్తే, మరొక కులపెద్ద రాననటం నేనింతవరకూ చూడలేదు. విన లేదు,'' అన్నాడు.

''సరే, గండుపోతూ అలాగే వస్తాం. కాని, ఇక్కడ ఉన్న మా పల్లెవాళ్లందరూ మాత్రం మీ గూడేనికి వచ్చే అవకాశం లేదు. నేనూ, శిఖిముఖీ, విక్రమకేసరీ, మరి నలుగురై దుగురు మా వాళ్లూ మీ గూడేనికి వస్తాం. మిగిలిన వాళ్లంతా చీకటి పడే లోపల మా పల్లెకు పోవటం అవసరం. ఆ శిథిలాలయ పూజారి పల్లెమీద మరెలాంటి ఘోరానికి పూనుకుంటాడో ఊహించలేం కదా,'' అన్నాడు.

''అదీ నిజమే. ఆ కాట్లకుక్కను పట్టు కుని చిత్రవధ చేసేవరకూ నాకు మన శ్శాంతి ఉండదు. ఊ.., బయలుదేర దామా?'' అన్నాడు గండుపోతు.




శివాలుడు తన అనుచరుల్లో నలుగు రైదుగురిని మాత్రం తన వెంట ఉంచు కుని తతిమ్మా వాళ్లను కుంభారమిట్ట పల్లెకు పోయి, రాత్రల్లా తగు జాగ్రత్తలో ఉండ మని హెచ్చరించాడు. ఆ తరవాత గండు పోతు అనుచరులు తమ నాయకుడికి డోలీ ఒకటి తయారు చేసి, అందులో అతణ్ణి కూర్చోపెట్టి, దాన్ని అటిద్దరూ, ఇటిద్దరూ భుజాలకు ఎత్తుకుని తమ గూడెం కేసి బయలు దేరారు. శివాలుడూ, శిఖిముఖీ, విక్రమకేసరీ దాన్ని అనుసరించి ప్రయాణ మయ్యారు.

దాదాపు ఓ గంట ప్రయాణం తరవాత అందరూ సవరపల్లెకు చేరేసరికి, పల్లె మధ్యలో ఉన్న గండుపోతు ఇంటి ముం దర పల్లెవాసులంతా గుమికూడి నవ్వుతూ, కేరింతలు కొడుతూ గంతులు వేయటం వాళ్లకనిపించింది. శివాలుడు పల్లెవాసుల ఉత్సాహం చూసి, శిథిలాలయ పూజారిని వాళ్లు పట్టుకొచ్చారేమో అనుకున్నాడు. కాని,

తీరా దగ్గిరకు పోయి చూస్తే, గండుపోతు కూతురు నాగమల్లి గుహ దగ్గిర దొరికిన ఎలుగుబంటు చేత రకరకాల ఆటలు ఆడిస్తున్నది.

''ఇప్పటికిప్పుడు పట్టుకున్న ఆ క్రూర మృగాన్ని ఇంతలోనే నీ కూతురు ఎలా మచ్చిక చేయగలిగింది, గండుపోతూ?'' అంటూ శివాలుడు ఆశ్చర్యపోయాడు.

''సాహసమే సవరమహాలక్ష్మి అన్నారు పెద్దలు. నా కూతురు సాహసంలో, ధైర్యంలో నాకు సమానురాలు, మీ శిఖిముఖి దానికి ఉజ్జీ అవునా కాదా అన్న సంశయం నన్ను బాధిస్తూనే ఉన్నది. ఇలా అన్నానని ఏమీ అనుకోకు, శివాలూ!'' అన్నాడు గండుపోతు, కూతురు కేసి ఆప్యాయంగా చూస్తూ.

నాగుమల్లి, తండ్రిని చూస్తూనే ఎలుగుబంటు మెడకు కట్టి ఉన్న తాడును వదిలి, ''అయ్యా, నడవలేనంతగా గాయపడ్డావా? ఏదో చిన్న దెబ్బ తగిలిందని చెప్పారే, మన వాళ్లు,'' అంటూ తండ్రిని కావిలించుకుని కన్నీళ్లు పెట్టుకున్నది.

''తగిలిన గాయం చిన్నదేనమ్మా, కాని, ఎడం కాలి కీలేదో కాస్త...'' అని గండుపోతు నవ్వుతూ శిఖిముఖి కేసి చేయి చూపి, ''అంత సవరగండుపోతును డోలీ ఎక్కించిందెవరో తెలుసా? ఆ కోడెకారు శిఖిముఖి, పైకి చూడ్డానికి అలా కనబడుతున్నాడు గాని ఎంత తెగువ! ఎంత గుండె బలం.'' అన్నాడు.

నాగుమల్లి చప్పునతల తిప్పి, శిఖిముఖి కేసి చూసింది. క్షణంలో ఆమె కన్నీళ్లు మాయమయినై. కోపంతో ఆమె కళ్లు ఎర్రబడినై, ముక్కుపుటాలు అదిరినై. ఏదో అనబోయినదల్లా ఆగి చప్పున తలపక్కకు తిప్పుకున్నది. ఇదంతా గమనిస్తున్న విక్రమకేసరి, శిఖిముఖితో రహస్యంగా, ''శిఖీ! మనకు విందు చేయటంలో గండుపోతు ఎత్తుగడ ఏమిటా అనే ఇంతవరకూ మనం ఆలోచిస్తున్నాం. అతడు మహా చేయగలిగితే ఆహారంలో విషం కలిపించగలడు. కాని కూతురు నాగుమల్లి నీ మీద పగపట్టినట్లున్నది, జాగ్రత్త!'' అన్నాడు.

శిఖిముఖి ఏదో అనబోయేంతలో ఎలుగుబంటు గాండ్రిస్తూ, అక్కడ చేరిన గుంపు మీద పడి, పంజాలతో అందిన వాణ్ణి అందినట్లు కొట్టి రక్కసాగింది. గుంపులో హాహాకారాలు బయలుదేరినై. నాగుమల్లి, శిఖిముఖీ ''తప్పుకోండి, తప్పుకోండి'' అని పెద్దగా కేకలు పెడుతూ ఎలుగ్గొడ్డు కేసి పరిగెత్తారు. (ఇంకా ఉంది)





# రూపాయి బిళ్ళ




చింటూ, చిన్నారి అన్నా చెల్లెళ్లు. చింటూ రెండో తరగతి, చిన్నారి ఒకటో తరగతి చదువుతున్నారు. వాళ్లిద్దరూ ఎంతో తెలివైనవాళ్లు. పైగా బుద్ధిమంతులు. ఒకసారి వాళ్ల స్కూలుకి సంక్రాంతి సెలవులిచ్చారు.

వాళ్లిద్దరూ ఒకరోజు పొద్దుటే పేపరు చదువుకుంటున్న తండ్రి దగ్గరకి వెళ్లారు. చిన్నారి చెంగున ఆయన ఒళ్లో గువ్వ పిట్టలా కూర్చుంది. అప్పుడు చింటూ ఇలా అడిగాడు.

''నాన్నా! మమ్మల్ని ఈ సెలవులకు అమ్మమ్మ వాళ్ల ఊరు దిగబెట్టవూ! అమ్మమ్మ ఇంచక్కా ఎన్నెన్నో కథలు చెబుతుంది. మామయ్య మాతో మంచి ఆటలాడిస్తాడు. అత్తయ్య మంచి మంచి పిండివంటలు చేసిపెడుతుంది.''

చిన్నారి అంది కదా! ''అంతేకాదు నాన్నారూ! మాకు అమ్మమ్మ ఉండే పల్లెటూరంటే ఎంతో ఇష్టం. ఎందుకంటే అక్కడ ఎంచక్కా పచ్చని చెట్లుంటాయి. చెట్లనిండా పళ్లుంటాయి. చెట్లమీద రామచిలకలు, కాకులు, పిచుకలు, గోరువంకలు కనిపిస్తాయి. అన్నయ్యను, నన్ను అక్కడకు పంపించు మరి.''

తండ్రి నవ్వుతూ అందుకు ఒప్పుకుని వాళ్లిద్దరినీ ఒక ఆదివారం నాడు అమ్మమ్మ గారి ఊళ్లో దిగబెట్టి తన ఆఫీసుకు సెలవు లేకపోవడంతో వెంటనే వెళ్లిపోయాడు.

చింటూ, చిన్నారికి ఒకటే సంబరం. అమ్మమ్మ వాళ్లిద్దరినీ దగ్గరకు తీసుకుని ముద్దులు పెట్టుకుంది. రోజూ పగలు ఇద్దరికీ అన్నంలో పప్పు, మంచి నెయ్యి వేసి ముద్దలు కలిపి తినిపించేది. తనతో బాటు రాములవారి గుడికి తీసికెళ్లి పంతులుగారి చేత తలపై శఠగోపం పెట్టించేది. ధ్వజస్తంభం చుట్టూ ప్రదక్షిణాలు చేయించేది. అత్తయ్య మధ్యాహ్నం

పి.వి. శేషారత్నం



వేళల్లో కరకరలాడే చెగోడీలు, జంతికలు, కజ్జికాయలు, అరిసెలు చేసి పెట్టేది. మామయ్య పిల్లలిద్దరినీ తనతో పొలం తీసుకు వెళ్ళి వాళ్లతో బోలెడు కబుర్లు చెప్పేవాడు. చింటూ, చిన్నారి ఆ పొల మంతా తిరుగుతూ తర్వాత తోటలోకి వెళ్లి చెట్లెక్కుతూ ఆడుకునేవారు. పక్షుల కిలాకిలారావాలకు పులకరించిపోయే వారు. అమ్మమ్మ రాత్రి అయ్యేసరికి ఇద్ద రినీ తన మంచంమీద చెరోపక్క పడుకో బెట్టుకుని ఎన్నో నీతికథలు చెప్పేది. అలా వాళ్లు సెలవులను ఎంతో ఆనం దంగా గడుపుతున్నారు.

ఒకరోజు మధ్యాహ్నం అమ్మమ్మ చింటూ, చిన్నారిలను దగ్గరగా పిలిచి ఇలా అంది. ''మీ ఇద్దరికీ ఒక రూపాయి బిళ్ల ఇస్తాను. నాలుగు వీధులవతల రాములవారి గుడికి ఎదురుగా కిరాణా కొట్టు ఉంది. ఇవాళ సాయంత్రం మనింట్లో పూజకు అగరొత్తులు కావాలి. తెచ్చిపెట్టండి.'' చింటూ, చిన్నారి ఉత్సా హంగా రూపాయి బిళ్ల పట్టుకుని పరు గులు తీశారు. కిరాణా కొట్టుకు చేరే లోగా, ఆ వీధి చివర వాళ్లకి ఒక ముసలి వ్యక్తి రోడ్డుమీద పడిపోయి ఉండటం కని పించింది. ఇద్దరూ దగ్గరికి వెళ్లి చూశారు. అతనికి బాగా గడ్డం పెరిగి ఉంది.

''తాతా లే ఏమయింది. అయ్యో పాపం! ఇలా రోడ్డుమీద ఎందుకు పడి పోయావు?'' అంటూ చిన్నారి అతడిని బాగా కుదిపింది. అతను కళ్లు తెరిచి చూశాడు. అతని కళ్లు బాగా లోతుకు పోయి ఉన్నాయి. చిన్నారి గబగబా గుడి లోకి వెళ్లి అక్కడి నుంచి ఒక ఖాళీ కొబ్బరి చిప్ప నిండా మంచినీళ్లు తీసుకువచ్చి ఆ తాతకి పట్టించింది.

''నేను పొరుగూరి వాడిని పాపా! రాత్రంతా భోజనం లేదు. పైగా నడిచి రావడంతో కళ్లు తిరిగి పడిపోయాను. ఇంకా బోలెడు దూరం నడిస్తే గాని నేను వెళ్లవలసిన ఊరు రాదు. మీ ఇద్దరూ నాకు చెయ్యి సాయం అందిస్తే లేచి వెళ్లిపోతాను,'' అన్నాడు.

చింటూకి చిన్నారికి ఆ వ్యక్తిమీద ఎంతో జాలి కలిగింది.

''ఉండు తాతా! ఇలా పక్కగా కూర్చో. ఇప్పుడే వస్తాను'' అంటూ చింటూ దగ్గర్లో ఉన్న కిరాణా కొట్టుకి వెళ్లి చేతిలోని రూపాయి బిళ్లను కొట్టువాడికి ఇచ్చి ఒక రొట్టెను కొనుక్కు వచ్చి తినిపించాడు.

ఆ ముసలి వ్యక్తి బాగా తేరుకున్నాడు. వాళ్లిద్దరి తలల మీదా చెయ్యి పెట్టి ''భగవంతుడు మిమ్మల్ని చల్లగా చూస్తాడు. మీకు మంచి బహుమతి కూడా ఇస్తాడు. మీరిద్దరూ నా ప్రాణం కాపాడారు. ఇంక వెళ్లొస్తాను పాపా, బాబూ!'' అంటూ దీవించి మెల్లగా నడుచుకుంటూ వెళ్లిపోయాడు. అతడు వెళ్లిపోయాక చింటూకి, చిన్నారికి అమ్మమ్మ తమకి రూపాయి బిళ్ల ఇచ్చి అగరొత్తులు తెమ్మన్న సంగతి గుర్తుకొచ్చింది.

''అన్నయ్యా ఇప్పుడెలా? రూపాయి బిళ్ల ఖర్చయిపోయింది. ఇంటికి వెళ్లి అమ్మమ్మకి ఏం చెప్పాలి?'' అంది చిన్నారి.

''పోయిందని చెబుదాంలే,'' అన్నాడు చింటూ. వాడికి మామయ్య తిడతాడేమో నని భయం. ''అలా చెప్పడం తప్పు కదూ,'' అంది చిన్నారి.

''తప్పేలే, కానీ ఏం చేస్తాం?... సరే ముందు ఇంటికెళ్దాం పద,'' అంటూ ఇద్దరూ నీరసంగా కాళ్లీడ్చుకుంటూ ఇంటికి చేరారు.

ఉత్సాహంగా పరిగెత్తుకెళ్లిన పిల్లలిద్దరూ నీరసంగా ఏడుపు ముఖాలు పెట్టుకుని వచ్చేసరికి అమ్మమ్మకి అనుమానమొచ్చింది. ఎక్కడైనా పడిపోయి దెబ్బలు తగిలించుకున్నారేమోనని.

''ఏమయిందర్రా. అలా ముఖాలు వేలాడేసుకు వచ్చారు. అగరొత్తులు ఏవీ?'' అని అడిగింది అమ్మమ్మ.

''మరేమో... రూపాయిబిళ్ల.. ఖర్చుపెట్టేశాం.. అగరొత్తులు తేలేదని దేవుడికి కోపం వస్తుందేమో అమ్మమ్మా!'' అంటూ ఏడుపు లంకించుకున్నారు పిల్లలిద్దరూ.

అమ్మమ్మ వాళ్లని బాగా బుజ్జగించి ''పోనీ లెండర్రా పిల్లలూ... ఈ రూపాయి బిళ్ల ఒక మనిషి ప్రాణం కాపాడింది కదా! అందుకని దేవుడు మిమ్మల్ని దీవిస్తాడు తప్ప కోపగించడు,'' అంది.

''అంతేకాదర్రా! దేవుడు మీకు మంచి బహుమతి కూడా పంపించాడు తెలుసా! కిరాణా కొట్టువాడు మీరు చేసిన మంచి పనిని ఊరందరికీ చెప్పి ఎంతో మెచ్చుకుంటూంటే నాకెంతో గర్వంగా అనిపించింది. ఇదిగో మీ బహుమతి,'' అంటూ మామయ్య నవ్వుతూ వాళ్లిద్దరికీ చెరొక చాక్లెట్ ఇచ్చాడు.



# బచ్చోం కి పహల్
## (పిల్లల చొరవ)

ప్రియమైన పాఠకులారా,

ఈ నెలలో మధ్యప్రదేశ్ నుంచి బాల విలేఖరుల న్యూస్‌లెటర్‌ని మీ ముందుకు తీసుకువస్తున్నాము. యునిసెఫ్‌తో భాగస్వామ్యం పంచుకున్న దళిత్ సంఘ్ ఎన్జీవో ఆ రాష్ట్రంలో బాల విలేకరుల వాణిని ''బచ్చోం కి పహల్'' అని పిలువబడుతున్న న్యూస్‌లెటర్ ద్వారా నెలవారీగా వెలికి తీసుకువస్తోంది.



Source:UNICEF MDG booklet

## రహదారిని బాగు చేయించిన సర్పంచ్

బాల జర్నలిస్టు: మోను యాదవ్

గుజర్‌వాడ: కీర్పూర్ రోడ్ మీద పెద్దస్థాయిలో బురద పోగుపడింది. దీంతో కీర్పూర్ అప్రోచ్ రోడ్డుమీదుగా గుజర్‌వాడలోని స్కూలుకు వెళ్లే పిల్లలు, గ్రామీణ ప్రజలు కూడా బాగా ఇబ్బంది పడేవారు. ప్రత్యేకించి రోడ్డుమీద పేరుకుపోయిన బురద మరియు గుంటలు కారణంగా విద్యార్థులు సకాలంలో పాఠశాలకు చేరుకునేవారు

కారు. ఈ సంవత్సరం గ్రామ సర్పంచ్ రహదారిపై ఇసుక పోయించారు. దీంతో విద్యార్థులు పాఠశాలకు సకాలంలో చేరుకోవడానికి వీలయింది. ఇప్పుడీ రహదారిమీద బురద లేదు. గుంటలు మాయమైపోయాయి. గ్రామీణులు, విద్యార్థులు రహదారిపై సులభంగా నడవగలుగుతున్నారు.



Source:UNICEF MDG booklet

## పాఠశాల చుట్టూ మల మూత్ర విసర్జన, పిల్లలకు ఇబ్బంది

బాల విలేకరి: భోజ్‌రాజ్

కపూరి: ప్రహరీ గోడ లేనందున పాఠశాల చుట్టూ మల మూత్ర విసర్జన చేసేవారు. దీంతో స్కూల్‌కి వెళుతున్న పిల్లలు, ఉపాధ్యాయులకు చాలా ఇబ్బంది కలిగేది. పాఠశాలలో మరుగుదొడ్ల నిర్మాణం అసంపూర్తిగా మిగిలి పోవడంతో బాల బాలికలు చాలా కాలంగా పలు ఇబ్బందులకు గురయ్యేవారు. పాఠశాల చుట్టూ మలమూత్రాదులు పేరుకుపోవడంతో విషపూరితమైన పాములు, ఇతర కీటకాలు చుట్టూతా కనిపించేవి. దీని కారణంగా పాఠశాలకు వెళుతున్న పిల్లలు భయపడేవారు.

పాఠశాలలో మరుగుదొడ్ల నిర్మాణాన్ని పూర్తిచేయాలని, పాఠశాల చుట్టూ ప్రహరీ గోడ కట్టాలని ఇక్కడి బాల విలేకరులు చాలా కాలంగా డిమాండ్ చేస్తూ వస్తున్నారు. కానీ, ఈ డిమాండ్లు నెరవేరలేదు. కపూరి గ్రామంలోని పాఠశాలలో మరుగుదొడ్డిని, చుట్టూ ప్రహరీ గోడ నిర్మాణాన్ని ప్రారంభించాలని పాలనా యంత్రాంగాన్ని అభ్యర్థించడమైనది.

# విద్యుత్ కోతల కారణంగా విద్యార్థులు, రైతులకు ఇక్కట్లు

బాల విలేకరి: ధన్వతి కుష్వా, తలౌంకలా

తరౌంకలా: నిత్యం విద్యుత్ కోతల కారణంగా తరౌంకలా గ్రామానికి చెందిన పిల్లల చదువులు దెబ్బతినేవి. ప్రత్యేకించి సాయంకాలం విద్యుత్ కోత మొత్తం గ్రామ జీవితానికి ఆటంకంగా మారేది. పిల్లలు ప్రతి రోజూ సాయంకాలం తమ ఇళ్లలో కూర్చుని వారి హోమ్ వర్క్ పూర్తి చేసుకుని ఆ తరవాత చదువుకునేవారు, కాని, కరెంటు కోత కారణంగా వారి చదువుకు ఆటంకం ఏర్పడింది. ఈ సంవత్సరం వానలు కూడా తక్కువగా పడ్డాయి. దీంతో పొలాల్లో వరి పంట ఎండిపోయింది. ఈ ప్రాంతంలోని రైతులు ప్రధానంగా గొట్టపుబావులపై ఆధారపడేవారు. కరెంట్ కొరత కారణంగా విద్యుత్ మోటార్లు నడిచేవి కాదు, దీంతో రైతులు పొలాల్లో సాగు చేయలేకపోయారు. చివరకు కరెంట్ వచ్చిన సందర్భంలో కూడా వోల్టేజ్ చాలా తక్కువగా ఉండటంతో మోటార్లు నడిచేవి కావు. తరౌంకులా గ్రామంలో నిత్య కృత్యంగా మారిన కరెంట్ కోతను తగ్గించాలని, తగిన వోల్టేజ్‌తో కనీసం 18 గంటలపాటైనా విద్యుత్ సౌకర్యాన్ని ఇవ్వాలని బాలవిలేకరులు పాలనాయంత్రాంగాన్ని కోరారు.



Source:UNICEF MDG booklet

# విద్య ప్రాధాన్యత, ఉపాధ్యాయుడి పాత్ర

బాల విలేకరి: విశాల్ చౌరే, గోపాల్ శర్యామ్

నిమ్‌సారియా (హోసంగాబాద్): ఇప్పుడు ప్రభుత్వం నిర్బంధ విద్యను అమలులోకి తీసుకువచ్చింది. దేశవ్యాప్తంగా 1 నుంచి 8వ తరగతి వరకు పిల్లలు ఉచిత, నిర్బంధ విద్యను పొందాలని ప్రభుత్వం నుంచి ఆదేశాలు జారీ అయినాయి. అందరికీ విద్య లక్ష్యంతో తీసుకు వచ్చిన 'సర్వశిక్షా అభియాన్' కార్యక్రమాన్ని విజయవంతం చేయాలని ప్రయత్నాలు చేపట్టారు. ఫీజుల కారణంగా గతంలో చదువుకోలేకపోయిన పేద పిల్లలకు కేంద్ర ప్రభుత్వం చేపట్టిన ఈ కార్యక్రమం ద్వారా ఇప్పుడు చదువుకోడానికి ఒక అవకాశం వచ్చింది. నిజంగా ఇది ప్రభుత్వం చేపట్టిన మంచి ప్రయత్నం. ఈ కార్యక్రమంలో ఉపాధ్యాయుడి పాత్రకు చాలా ప్రాముఖ్యత ఉంది. ఉపాధ్యాయుల కృషి ఫలితంగానే ప్రతి బాలుడూ, బాలికా విద్యావంతుల వుతారు. అప్పుడు మాత్రమే 'సర్వశిక్షా అభియాన్' కార్యక్రమం విజయవంతమవుతుంది. విద్య అనే కాంతి దేశంలోని అన్ని ఇళ్లలో వ్యాపిస్తుంది. బాలబాలికలు అందరూ చదవడం, రాయడం చేస్తారు. దీని ఫలితంగా గ్రామంలో నిరక్షరాస్యులూ, చదువుకోని వారు ఎవరూ ఉండరు.




Source: UNICEF MDG booklet







ఈ కథనం మీకు నచ్చిందా? మీ అభిప్రాయం మాకు పంపండి!

CHANDAMAMA INDIA LTD.,
B-3, Cross Road 'B', MIDC, Andheri (East),
Mumbai-400093.
Phone : +91 22 28312872 / 28311849
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

Dalit Sangh
House No.13, "Mitra Kunj",
Street: Lata Marg, Sohagpur,
Distt: Hoshangabad,
State : Madhya Pradesh, India.
PIN – 461 771

చందమామ ప్రియ పాఠకులారా, మీ అభిప్రాయాలు తెలుసుకోవడానికి ఇక్కడ మేమెంతో ఇష్టపడుతున్నాము. బచ్పన్ కి పహల్ లేవనెత్తిన అంశాలపై మీ వ్యాఖ్యలు/కథనాలను మాకు పంపండి. ఈమెయిల్: **asiddiqui@unicef.org**



# నిజమైన (దీపావళి) కల!



అప్పుడప్పుడే తెల్లవారుతోంది. అంబాపురం బాలబాలికలు అప్పటికే రాజంపేటకేసి నడిచి వెళుతున్నారు.

రాజంపేటలో రాజశేఖరంకి బాణాసంచా తయారుచేసే ఫ్యాక్టరీ ఉంది. అయితే, తను మాత్రం లండన్‌లో ఉంటూ మరికొన్ని వ్యాపారాలు చూసుకుంటున్నాడు. ఫ్యాక్టరీ నిర్వహణా బాధ్యతలు చంద్రమోహన్ అనే మేనేజర్ చూసుకుంటున్నాడు. పెద్దలకయితే ఎక్కువ కూలీ ఇవ్వాలి కాబట్టి, ఫ్యాక్టరీలో పిల్లలకే ఎక్కువ ఉద్యోగాలు.

ఆ ఫ్యాక్టరీలోనే అంబాపురానికి చెందిన - మోహన్, కృష్ణ, సీత, జాన్సన్, అఫ్సర్ అనే ఐదుగురు పిల్లలు ఉదయం నుంచి, సాయంకాలం వరకు పని చేస్తారు. వాళ్ళందరూ ఏడేళ్ళ నుంచి పదకొండేళ్ళ లోపు వాళ్ళు. రెక్కల కష్టం మీదే ఆధారపడ్డ ఆ పిల్లల తల్లిదండ్రులకు-తమ పిల్లల్ని కూడా పనులకు పంపితే తప్ప రెండు పూటలా గంజి కూడా దొరకని దుస్థితి. రాజంపేట అంబాపురానికి దూరంలో ఉండడం వల్ల, పిల్లలు సూర్యోదయానికి ముందే బయలుదేరారు. ఆ పిల్లల్లో అఫ్సర్ ఎప్పటిలాగే ఏదో ఆలోచిస్తూ నడుస్తున్నాడు. అనారోగ్యంతో బాధపడుతూన్న తన తల్లికీ, నాలుగేళ్ళ తమ్ముడికీ ఏదైనా దీపావళి కానుక ఇవ్వాలి. యేడాది క్రితం రోడ్డు ప్రమాదంలో తన తండ్రి మరణించినప్పటినుంచి తాము అనుభవిస్తూన్న కష్టాలు అన్నీ ఇన్నీ కావు.

మోహన్, కృష్ణ ఏదో పాట పోటీపడి బిగ్గరగా పాడుకుంటూ నడుస్తున్నారు. సీత దారిలో దొరికిన జామ కాయలు తింటూ నడుస్తోంది. జాన్సన్ రకరకాల పక్షుల కూతలను అనుకరించడానికి ప్రయత్నిస్తూ నడుస్తున్నాడు.

మొత్తంమీద సమయానికి వాళ్ళు ఫ్యాక్టరీని చేరుకున్నారు. వాళ్ళలాగే చుట్టుపక్కల గ్రామాల నుంచి యాభై, అరవైమంది పిల్లలు





ఆ ఫ్యాక్టరీలో పనిచేస్తు న్నారు.

రసాయనికపదార్థాలు కలిపేటప్పుడు చేతులకు తొడుక్కోవడానికి, సంవత్స రారంభంలో రబ్బర్ తొడు గులు ఇచ్చారు. కాని అవి కొన్నాళ్ళకు అరిగిపోయి, చిరిగి పోయాయి. మేనే జర్ ఆ తరవాత కొత్తవి కొని పెట్ట లేదు. చేతులు మంటలు పుడుతున్నాయి. ఆ బాధను భరించలేక, అఫ్సర్ కలపడం ఆపి పక్కకు వెళ్ళాడు. అప్పుడే తలుపుకు అవతల వున్న టెలిఫోన్ గంట మోగింది. చంద్రమోహన్ ఫోన్‌ను అందుకుని, ''ఎవరూ?'' అన్నాడు అదిలిస్తున్నట్టు. అయితే మరుక్షణమే నవ్వుతూ, అతి వినయంగా, ''నమస్కారం! నమస్కారం! అవును బాబూ! ఇక్కడ అన్నీ సక్రమంగా నడుస్తున్నాయి. అవునవును. అలాగే... ఈ మధ్యే జీతాలు పెంచాను. కార్మికులందరూ చాలా సంతోషంగా ఉన్నారు. రేపే మీకు అక్కౌంట్ బుక్స్ పంపుతాను. తమరు ఇంత దూరం వచ్చి తమ సమయాన్ని వృథా చేసుకోనవసరం లేదు. అలాగే.. అలాగే.. ఏవైనా సమస్యలుంటే నేనే మీకు తెలియజేస్తాను. నమస్కారం!'' అన్నాడు.

సాయంకాలం దారిపొడుగునా అఫ్సర్ పొద్దున విన్న మాటలే తలచుకుని, తీవ్రంగా ఆలోచించసాగాడు. తమ యజమాని మంచి వాడనీ, ఫ్యాక్టరీలో జరుగుతూన్న అన్యాయాలు ఆయనకు తెలియవనీ, ఇక్కడ జరుగుతూన్న అన్యాయాలను యజమానికి ఎలాగైనా తెలి యజేయాలని, ఆ విషయం సీతకు చెప్పాడు.

సీత అఫ్సర్ సలహా ప్రకారం–యజమానికి ఒకసారి ఫ్యాక్టరీకి వచ్చి పరిస్థితులను ప్రత్య క్షంగా పరిశీలించి, సరిదిద్దమని ప్రార్థిస్తూ ఉత్తరం రాసింది. అఫ్సర్ అందులో సంతకం చేశాడు. మరునాడు ఉదయం సీత ఫ్యాక్టరీకి కాస్త ఆలస్యంగా రావాలనీ, మేనేజర్ వెళ్ళి ఆమెను మందలిస్తున్న సమయంలో అఫ్సర్ ఆయన గదిలోకి వెళ్ళి, అతడు యజమానికి పంపే అక్కౌంటు బుక్‌లో ఉత్తరం పెట్టాలనీ పథకం వేసుకున్నారు.

మరునాడు ఉదయం అందరితో పాటు వచ్చిన సీత కొంచెందూరంలోనే ఆగిపోయింది. మిగిలిన పిల్లలు వేగంగా ఫ్యాక్టరీని చేరుకు న్నారు. వాళ్ళను చూడగానే మేనేజర్, ''ఇంకో పిల్ల ఎక్కడ?'' అని అడిగాడు.

కృష్ణ ఏదో చెప్పబోయాడుగాని నోటి నుంచి మాట పెగల్లేదు. అఫ్సర్ దూరంనుంచి, ''మేము బయలు దేరేంత వరకూ సీత నిద్ర లేవలేదు బాబూ,'' అన్నాడు గట్టిగా.

''వచ్చిన వాళ్ళు శిలల్లా అలాగే నిలబడి పోయా రేంటి? పనిలోకి దిగండి,'' అని గద్దిస్తూ మేనేజర్ అక్కడే నిలబడ్డాడు.

ఇదే సమయం అనుకుని అఫ్సర్ వెనకవైపు నుంచి మేనేజర్ గదిలోకి వెళ్ళాడు. టేబుల్ మీద అందమైన పెద్ద పుస్తకం కనిపించింది. అదే అక్కౌంటు బుక్కయి వుంటుందని భావించి అఫ్సర్ జేబులోని ఉత్తరాన్ని అందులో పెట్టి గుట్టుచప్పుడు కాకుండా వచ్చేశాడు.

ఆ తరవాత నెలరోజులు గడిచిపోయాయి. అయితే అఫ్సర్‌కు మాత్రం ఒక్కొక్కరోజు ఒక్కొక్క గండంగా తోచింది. ఆ ఉత్తరం యజమానికి అందిందా? లేదా? అన్న అనుమానంతో సతమతం కాసాగాడు.

ఒకనాడు ఉదయం ఫ్యాక్టరీ ఆవరణలో అందమైన కారు ఒకటి ఉండడం చూసి పిల్లలు ఆశ్చర్యపోయారు. హడావుడిగా అక్కడికి వచ్చిన మేనేజర్ అందరినీ ఫ్యాక్టరీ వెనక్కుతీసుకు వెళ్ళి, ''ఈ రోజు మీరందరూ ఇళ్ళకు వెళ్ళండి. మన యజమాని శేఖరం బాబు వచ్చారు. మీ పనితీరు చూసి మండిపడ్డారు. మీ ఏడుపు కొట్టు మొహాలు చూస్తూంటే నాకే సయించడం లేదు. పొద్దుటే మీ పాడు మొహాలు చూడడానికి బాబుగారు ఇష్టపడరు. పనుల్నుంచి ఇప్పుడే తొలగించేస్తారు. మరో ముఖ్య విషయం. మీకీ ఉద్యోగాలు దక్కాలంటే - మేనేజర్ మమ్మల్ని బాగా చూసుకుంటున్నారు. మాకే కొరతా లేదు అని మీరంతా యజమానిగారితో చెప్పాలి. అర్థమయిందా?'' అన్నాడు.

హఠాత్తుగా రాజశేఖరం లోపలికి వచ్చి, ''ఇక్కడ ఏం జరుగుతున్నది. అయినా పిల్లలకు ఇక్కడేం పని? బడికి వెళ్ళలేదా? అవునూ, ఇక్కడ అఫ్సర్ ఎవరు? నేను అతనితో మాట్లాడాలి,'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

పిల్లలు అఫ్సర్‌ను చూపారు.

''రా బాబూ, ఇలారా! నిన్నేం చేయను,'' అంటూ వాడి చేతులకేసి చూసి, ''అదేంటి వేళ్ళలా కాలిపోయి ఉన్నాయి? ఎందుకలా అయింది?'' అని అడిగాడు. మిగతా పిల్లలందరూ తమ చేతులను కూడా చూపి సంగతి వివరించారు.

రాజశేఖరం మేనేజర్‌కేసి కోపంగా చూస్తూ, ''మా పూర్వీకుల స్వస్థలంలో నేను ఏర్పాటు చేసిన ఫ్యాక్టరీని నువ్వు నడిపే లక్షణం ఇదన్నమాట!'' అన్నాడు. మేనేజర్ అవమానంతో, భయంతో తల వంచుకున్నాడు.

రాజశేఖరం పిల్లలకేసి తిరిగి, ''మీ సంక్షేమం పట్ల నేను చూపిన నిర్లక్ష్యానికి క్షమాపణలు చెప్పుకుంటున్నాను. జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడు ఇక్కడ పనిచేస్తూన్న బాలబాలికలందర్నీ బడులలో చేర్పిస్తాను. ఫీజులతో సహా మీ ఆలనా పాలనా చూసుకునే బాధ్యత నాది!''అంటూ పిల్లలకు స్వీటు ప్యాకెట్లూ, టపాకాయల ప్యాకెట్లూ పంచాడు.

ఆ రోజు వరకు తమ ఇళ్ళ వద్ద సూర్యోదయాన్ని చూడలేకపోయిన ఆ పిల్లల మనసులలో నూతన విశ్వాసం ఉదయించింది.

అఫ్సర్ మనసులోనే అల్లాకు కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. తన తల్లీ, తమ్ముడితో కలిసి జరుపుకోనున్న ఆనందదీపావళిని తలుచుకుంటూ ఉత్సాహంగా ఇంటికేసి నడిచాడు.

- కె.సి. నిత్య



# చైనా జానపద కథ

# యువాన్‌షియావో ఇల్లు చేరిన కథ



చాలా సంవత్సరాలకు పూర్వం వూడీ అనే చక్రవర్తి చైనాదేశాన్ని పాలించేవాడు. ఆయన రాజ భవనంలో యువాన్ షియావో అనే పరిచారిక ఉండేది. సంవత్సరం పొడవునా ఒక్క రోజు కూడా విశ్రాంతి లేకుండా ఆమె పనిచేస్తూ ఉండేది.

ఆమెకు తన కుటుంబం వారిని చూసి రావాలనే కోరిక కలిగింది. అయినా ఎవరూ ఆమె కోరికను పట్టించుకోలేదు. ఆ కాలంలో సేవకులు ఎవరూ రాజ భవనం వదిలి వెళ్ళకూడదనే నియమం ఉండేది. ఆ కఠిన నిబంధనను తప్పకుండా రాజోద్యోగులు అమలు పరిచేవారు.

యువాన్‌షియావోకు రాజభవనంలో డాంగ్ ఫ్యాంగ్ అనే స్నేహితుడు ఉండేవాడు. ఆయన రాజు కొలువులో ఒక మంత్రి. ఆమె ఆయనకు ప్రతి రోజూ చందు రొట్టెలు, చేసి ఇచ్చేది. ఆ రొట్టెలంటే ఆయనకు ఎంతో ఇష్టం.



ఒకనాడు యువాన్ షియావో, కుటుంబాన్ని చూసి రావాలన్న తన కోరికను డాంగ్‌ఫ్యాంగ్‌కు తెలియజేసింది. ఆయన ఆమెకు ఎలాగైనా సాయపడాలని నిర్ణయించుకున్నాడు. ఆయన చాలా తెలివైనవాడు కాబట్టి, మంచి ఉపాయాన్ని ఆలోచించాడు.

మంత్రి కావడంవల్ల, చక్రవర్తి ఆయన మాట వింటాడు. పథకం మేరకు ఆయన చక్రవర్తిని రాజసభ ముగిసిన తర్వాత కలుసుకుని, ''కొత్తసంవత్సరం వేడుకల చివరి రోజు, అంటే చాంద్రమానం మొదటి నెల పదిహేనవ తేదీ – మన నగరాన్ని నాశనం చేయమని స్వర్గాధిపతి, అగ్ని దేవుణ్ణి ఆజ్ఞాపించాడట!'' అన్నాడు.

చక్రవర్తి కలవరపాటుతో ''ఈ చిక్కు సమస్యకు తరుణోపాయం ఏమిటి'' అని అడిగాడు.

''అగ్నిదేవుడి ఆగ్రహం నుంచి నగరాన్ని కాపాడుకోవడానికి మనం రాజ్యంలోని ప్రజలందరి సాయం పొందాలి. వారిలో ప్రతిఒక్కరూ వాళ్ళ వాళ్ళ కుటుం

బాలను తప్పకుండా కలుసుకోవాలి. ఆ రాత్రి ప్రతి ఇంటి ముందూ ఎర్రలాంతరు వెలిగించాలి. ఆ రాత్రంతా వాళ్ళ వాళ్ళ శక్త్యానుసారం బాణా సంచా పేల్చాలి. ఇవన్నీ అగ్ని దేవుణ్ణి ఆనంద పరుస్తాయి గనక, ఆయన మనకు ఎలాంటి హాని చేయడు,'' అన్నాడు మంత్రి.

''అలాగా!'' అన్నాడు చక్రవర్తి.

''అవును ప్రభూ! అగ్నిదేవుడికి ఇష్టమైన చందురొట్టెలు కూడా పెట్టాలి,'' అన్నాడు మంత్రి వినయంగా.



యువాన్‌షియావో తయారు చేసే చందురొట్టెలు అప్పటికే ప్రసిద్ధం గనక, ఆమెను చాలా రొట్టెలు తయారుచేయమని చెప్పారు.

మంత్రి చెప్పినట్టే, ప్రజలందరూ నడుచుకోవాలని చక్రవర్తి ప్రకటించాడు.

ఆనాటి రాత్రి ఎర్రలాంతర్ల వెలుగులతో, బాణాసంచా పేలుళ్ళతో, ప్రజలందరూ కుటుంబాలతో కలిసి చందు రొట్టెలు తినడంతో నగరం ఆనందమయం అయింది. ఆ విధంగా యువాన్ షియావో తన కుటుంబాన్ని కలుసుకోవాలనే కోరిక కూడా తీరింది!

మొత్తం మీద నగరానికి ఎటువంటి ఆపదా కలగలేదు. పైగా ఆనాటి వేడుకలు చక్రవర్తికి ఎంతో ఆనందం కలిగించాయి. కాబట్టి యేటా ఇదేవిధంగా క్రమం తప్పకుండా పండుగ జరుపుకోవాలని రాజు ప్రకటించాడు.

ఆ కారణంగా యేడాదికో సారి బాణాసంచా వేడుకలు జరుపుకోవడం అలవాటయింది. నూతన సంవత్సర వేడుకల చివరి రోజున లాంతరు ఉత్సవం జరుపుకోవడం తప్పనిసరి ఆచారమయింది!

చాంద్రమాన నూతన సంవత్సరాన్ని చైనాలో వసంతోత్సవంగానూ కొన్ని రోజులపాటు జరుపుకుంటారు. ఇది చైనాలో జాతీయ పండుగగా పేరు గాంచింది.

కొత్త సంవత్సరం ఆరంభం కావడానికి ఇరవై రోజులు ముందునుంచే చెత్తా చెదారాన్ని శుభ్రం చేసి ఇల్లూ వాకిలీ అలంక రిస్తారు. ఇంటిల్లిపాదికీ కొత్త బట్టలు కొంటారు.

రేపు కొత్త సంవత్సరం అంటే ఈరోజే గృహిణులు ఇళ్ళను శుభ్రం చేసేస్తారు.

సంవత్సరాది రోజున శుభ్రం చేస్తే ఇంటికి అశుభం అనీ, తాము ఊడ్చే చెత్తతో పాటు తమ అదృష్టం కూడా దాంతోపాటు వెళ్ళి పోతుందనీ కొందరు భావిస్తారు.

ఆరోజు అందరూ పిండివంటలు చేసుకుని తింటారు. ముఖ్యంగా ఎనిమిది రకాల కూరలతో 'అష్టనిధి భోజనం' చేస్తారు. పిల్లలు పెద్దల నుంచి డబ్బున్న ఎర్రటి కవర్లు నజరానాగా పుచ్చుకుంటారు.

సాయంకాలం అందమైన లాంతర్లు వెలిగించి దుష్టశక్తులను భయపెట్టి, నూతన సంవత్సరాన్ని ఆహ్వానించడానికి బాణాసంచా పేలుస్తారు. ఈ కార్యక్రమాలలో ప్రజలు ఉత్సాహంతో పాల్గొంటారు.

మనదేశంలో కొన్ని ప్రాంతాలలో దీపావళి రోజున చేసే విధంగా కొందరు చైనా వ్యాపారులు కొత్త లెక్కలు కూడా ప్రారంభిస్తారు.

కొత్త సంవత్సరం పదిహేనవ రోజు లాంతరు ఉత్సవం జరుపుకుంటారు. కొత్త సంవత్సరంలో వచ్చే తొలి పౌర్ణమి అయిన ఆనాటి రాత్రి ఆకాశంలో ఎగిరే దేవతలు కనిపిస్తారని, వారు కనిపించడం కుటుంబానికి క్షేమకరమని కొందరి విశ్వాసం.

అందుకోసం వారిని లాంతర్లతో వెతుకుతారట! ఆ రాత్రి బియ్యంతో తయారు చేసే యువాన్షియావో (పౌర్ణమిని గుర్తు చేసే) చందురొట్టెలు చేసి తింటారు.

ఈ సందర్భంగా కొన్ని దేవాలయాలలో 'డ్రాగన్ నృత్యం' కూడా ఏర్పాటు చేస్తారు. మెరిసే కళ్ళతో, రంగురంగుల అలంకారాలతో, వింతవింత వాద్యాల ఘోషతో వంద అడుగుల పొడవు డ్రాగన్‌ను వీధులగుండా నాట్యం చేయిస్తూ ఊరేగింపుగా తీసుకువెళతారు. దీంతో నూతన సంవత్సర వేడుకలు సమాప్తమవుతాయి!



# కెరీర్ అంటే?



పదవ తరగతి, ప్లస్ టూ పూర్తయ్యాక విద్యార్థులు తీసుకోదగిన సబ్జెక్టులను గతంలో మనం విభాగాల వారీగా చర్చించాము. ఆ వివరాలను ఇప్పుడు పరిశీలిద్దాము.

మొట్టమొదటగా మనం ఇంజినీరింగ్‌ను కెరీర్ అవకాశంగా చూద్దాము. ఇంజినీరింగ్ పురాతన వృత్తి. మానవులు పూర్వం నుండీ ప్రాథమిక ఆవిష్కరణలను కనిపెట్టారు. ఇంజినీరింగ్ పదం ఇంజనీర్ అనే పదం నుంచి పుట్టింది. ఇంజిన్‌ను లేదా యంత్రాన్ని నిర్వహిస్తున్న వ్యక్తి అని దీనర్థం. ఇంజనీరింగ్‌లో దాదాపు 25 విభాగాలున్నాయి.

మొదలెట్టడానికి ముందు మనం రెండు ముఖ్యమైన విభాగాలను పరిశీలిద్దాము.

| విభాగం | లక్ష్యాలు | అర్హత |
|---|---|---|
| ఏరోస్పేస్; ఏరోనాటికల్ మరియు ఆస్ట్రోనాటికల్ ఇంజినీరింగ్ | * యుద్ధవిమానం, క్షిపణులు, ఉపగ్రహాలు, రాకెట్లు, అంతరిక్ష వాహనం మరియు ఎగిరే ప్రతి వాహనం యొక్క డిజైనింగ్, నిర్మాణం, పరీక్ష.<br>* వివిధ యంత్రాలకు సంబంధించిన కొత్త సామగ్రి, ఇంజిన్లు, యంత్రాల ఆకారాలు, నిర్మాణాలు వంటి వాటి పరిశోధన.<br>* ప్రాజెక్ట్ భావనీకరణ, బోర్డ్ డ్రాయింగ్ మరియు ప్రణాళిక పనిలో ఒక బృందం మునిగి ఉంటుంది.<br>* ప్రాజెక్టు ముగింపుకు సంబంధించినంతవరకు ఈ బృందం మొత్తం పనికి కన్సల్టెంట్‌గా వ్యవహరించి పనిలో తలెత్తే ఏ సమస్యలనయినా పట్టించుకుంటుంది. | ఫిజిక్స్, కెమిస్ట్రీ, లెక్కలతో ప్లస్ టూ; ఏరోస్పేస్ ఇంజనీరింగ్‌లో బి.టెక్ పూర్తి చేసి ఉండాలి.<br>లేదా<br>మెకానికల్/ఎలెక్ట్రికల్/ ఎలెక్ట్రానిక్స్ ఇంజనీరింగ్‌లో బి.ఇ లేక బి.టెక్; ఏరోస్పేస్ ఇంజనీరింగ్‌లో ఎంటెక్. |
| వ్యవసాయ ఇంజనీరింగ్ శాస్త్రం వ్యవసాయ పనిముట్లు మరియు యంత్ర రూపకల్పన మరియు అభివృద్ధి పనులతో వ్యవహరిస్తుంది. | * వ్యవసాయ సరకుల ఉత్పత్తి, ప్రాసెసింగ్, రవాణా, నిల్వ.<br>* భూమి, నీటి వనరుల నిర్వహణ, వ్యవసాయ ఉత్పత్తి, ప్రాసెస్ చేసిన ఆహార తయారీ.<br>* ఈ ఇంజనీర్లు వ్యవసాయ భవంతుల నిర్మాణ ప్రణాళిక, రూపకల్పన, నిర్మాణం పనులు కూడా చేపడతారు.<br>* ఫీల్డ్ ఇంజనీర్లు సాగునీరు, మురికినీరు, భూ వనరుల ప్రణాళికతో వ్యవహరిస్తారు. | ఫిజిక్స్, కెమిస్ట్రీ, లెక్కలులో ప్లస్ టూ బయాలజీ కూడా ఉంటే మంచిది; అగ్రికల్చరల్ ఇంజనీరింగ్‌లో బి.ఇ. |

– సాయి





# నవ్వుల పువ్వులు

భర్త: ఈరోజు నేనొక మనిషి నిండు జీవితాన్ని కాపాడాను.
భార్య: అవునా ఎలా?
భర్త: నేను ఒక బిక్షగాడిని అడిగాను. ''నేను నీకు వెయ్యి రూపాయలను ఇస్తే నువ్వేం చేస్తావు?'' అతడిలా సమాధానమిచ్చాడు ''ఆనందం పట్టలేక చచ్చిపోతానయ్యా'' అందుకే నేను తనకు ఏ డబ్బూ ఇవ్వలేదు మరి!





అమ్మ: ఈ రోజు బడిలో ఏం నేర్చుకున్నావు?
కొడుకు: రాయటం ఎలాగో నేర్చుకున్నానమ్మా.
అమ్మ: నీవేం రాశావు?
కొడుకు: నాకు తెలీదు. వాళ్లు మాకింకా చదవటం ఎలాగో నేర్పలేదు!

మదన్: నేను రోజులో ఎనిమిది గంటలు పనిచేసి ఎనిమిది గంటలు నిద్రపోతాను.
రోహిత్: మరి వాళ్లు నీమీద ఎందుకు విరుచుకుపడుతున్నారు?
మదన్: ఎందుకంటే పనిచేసేదీ, నిద్రపోయేదీ ఆ ఎనిమిది గంటల్లోపే మరి.





టీచర్: కొత్తవారు నీకు వెన్న బిస్కెట్లు ఇస్తే నీవు వాటిని తీసుకుంటావా?
దత్తు: లేదు మేడమ్, తీసుకోను.
టీచర్: మంచిది. ఎందుకు తీసుకోవు?
దత్తు: నాకు వెన్న బిస్కెట్లు ఇష్టం లేదు.

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 22

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - 22 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. నవంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. జనవరి 2011 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## రెండో ప్రపంచ యుద్ధ విశేషాలు!




1. రెండో ప్రపంచ యుద్ధం ఎప్పుడు ప్రారంభమై ఎప్పుడు ముగిసింది?
2. పోలెండ్‌కి వ్యతిరేకంగా జర్మనీ ఏ ప్రత్యేక వ్యూహం అమలు చేసింది?
3. యుద్ధంలో సైనికపరంగా ఏ దేశం తీవ్రంగా నష్టపోయింది?
4. 1940 దురాక్రమణలో హిట్లర్‌తో కలిసి నడిచిన ఇటలీ నియంత పేరేమిటి?
5. రెండో ప్రపంచ యుద్ధ కాలంలో ''బిగ్ ఫోర్''గా పిలువబడిన దేశాధినేతలు ఎవరు?

## చందమామ లోకజ్ఞానం క్విజ్-20 సెప్టెంబర్ 2010 సమాధానాలు

1. విల్‌హెల్మ్ రోయింట్‌జన్, 2. వైట్‌కాంబ్ జస్టిన్, 3. జేమ్స్ వాట్, 4. జార్జ్ హెచ్ వీలర్, జెస్సీ డబ్ల్యూ రెనో, 5. సర్ హెన్రీ కోల్, 6. రైట్ బ్రదర్స్, 7. చార్లెస్ బాబేజ్, 8. కింగ్.సి. గిల్లెట్

సెప్టెంబర్ నెల క్విజ్‌కు విజేతలు లేనందువల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.

# సుడోకు పజిల్

కింది రెండు సుడోకు పజిల్స్‌ని పరిష్కరించి, మీ పరిష్కారాలను మాకు పంపించండి. ప్రతి వరుసలో 1 నుంచి 9 వరకు అంకెలు అడ్డంగా, నిలువుగా నింపండి. ఒక వరుసలో ఒక అంకెను ఒకసారి మాత్రమే వాడాలి. ప్రతి 3X3 చదరంలోనూ 1 నుండి 9 అంకెలు ఉండాలి. పజిల్స్‌కు పరిష్కారాలు జనవరి 2011 సంచికలో ప్రచురించబడతాయి. సరైన సమాధానాలు పంపిన విజేతల్లో ఒక్కరికి రూ.500 బహుమతి ఉంటుంది.

పజిల్ - 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | 3 | | 9 | | 1 | | 4 |
| | 6 | 5 | 1 | | | | | |
| 7 | | | | | | | | |
| | | | | | 7 | | | |
| | | 1 | | 3 | | 9 | 6 | |
| 3 | | | 4 | | | | | |
| | | | | | | | | 6 |
| | | | | | 5 | 7 | 8 | |
| 9 | | 8 | | 2 | | 5 | | |

పజిల్ - 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | 3 | | | | | | 4 |
| 1 | 5 | 7 | 4 | | 9 | | | 3 |
| | | | 6 | | | | 2 | |
| | 1 | | 9 | | | 5 | | |
| 7 | | | | | | | | 1 |
| | | 8 | | | 3 | | 9 | |
| | 9 | | | | 6 | | | |
| 6 | | | 5 | | 4 | 1 | 3 | 9 |
| 8 | | | | | | 6 | | |

మీ ఎంట్రీలను 2010 నవంబర్ 25వ తేదీలోగా పంపించండి. పంపవలసిన చిరునామా:

**Editor, SUDOKU PUZZLE, CHANDAMAMA INDIA LTD.,**

B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.

e-mail your entries to:contests@chandamama.com

---

సెప్టెంబర్ 10 సుడోకు పజిల్స్‌కు సరైన పరిష్కారాలు:

పజిల్ - 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 4 | 2 | 7 | 3 | 5 | 8 | 1 | 6 | 9 |
| 1 | 9 | 8 | 6 | 2 | 4 | 3 | 5 | 7 |
| 6 | 3 | 5 | 1 | 9 | 7 | 4 | 2 | 8 |
| 9 | 4 | 2 | 5 | 6 | 1 | 8 | 7 | 3 |
| 7 | 5 | 1 | 2 | 8 | 3 | 9 | 4 | 6 |
| 8 | 6 | 3 | 7 | 4 | 9 | 5 | 1 | 2 |
| 3 | 7 | 4 | 9 | 1 | 2 | 6 | 8 | 5 |
| 2 | 8 | 6 | 4 | 3 | 5 | 7 | 9 | 1 |
| 5 | 1 | 9 | 8 | 7 | 6 | 2 | 3 | 4 |

సెప్టెంబర్ 10 సుడోకు పజిల్స్‌కు విజేతలు లేనందు వల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.

పజిల్ - 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 8 | 5 | 4 | 2 | 9 | 7 | 6 | 3 | 1 |
| 3 | 9 | 7 | 8 | 6 | 1 | 4 | 2 | 5 |
| 2 | 6 | 1 | 4 | 3 | 5 | 7 | 9 | 8 |
| 1 | 7 | 2 | 9 | 4 | 3 | 8 | 5 | 6 |
| 9 | 4 | 6 | 7 | 5 | 8 | 3 | 1 | 2 |
| 5 | 3 | 8 | 1 | 2 | 6 | 9 | 7 | 4 |
| 6 | 1 | 9 | 5 | 7 | 4 | 2 | 8 | 3 |
| 7 | 8 | 3 | 6 | 1 | 2 | 5 | 4 | 9 |
| 4 | 2 | 5 | 3 | 8 | 9 | 1 | 6 | 7 |



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | Is tomorrow a holiday? | Can I get some water? |
|---|---|---|
| Telugu | రేపు సెలవుదినమేనా? | నాకు కాసిన్ని నీళ్లు ఇస్తారా? |
| Hindi | क्या कल छुट्टी है?<br>క్యా కల్ చుట్టి హై? | क्या मुझे थोडा पानी मिल सकता है?<br>క్యా ముజె థోడా పానీ మిల్ సక్తా హై? |
| Tamil | நாளை விடுமுறையா?<br>క్యా కల్ చుట్టి హై? | எனக்குத் தண்ணீர் கிடைக்குமா?<br>క్యా ముజె తోడా పానీ మిల్ సక్తా హై? |
| Bengali | অগামীকাল কী ছুটি?<br>ఆగామికాల్ కి చుట్టీ? | আমি কি একটু জল পেতে পারি?<br>అమి కి ఎక్తు జోల్ పెథాయె పారీ? |
| Marathi | उद्या सुट्टी आहे का?<br>ఉధ్యా సుట్టి ఆహే కా? | मला थोड पाणी मिळेल का?<br>మాలా తోడా పానీ మిలేల్ కా? |
| Kannada | ನಾಳೆ ರಜಾ ದಿನವೇ?<br>నాళె రజా దినవే? | ನನಗೆ ಸ್ವಲ್ಪ ನೀರು ಸಿಗಬಹುದೇ?<br>ననగె స్వల్ప నేరు సిగబహుడె? |
| Oriya | କାଲି ଛୁଟି କି?<br>కాలి చుట్ట కి? | ମୁଁ ଟିକେ ପାଣି ପାଣି ପାଇପାରିବି କି?<br>మున్ టికె పానీ పాయీపారిబి కి? |
| Gujarati | કાલે રજા છે?<br>కలె రజా ఛే? | મને થોડું પાણી મળી શકશે?<br>మనె తొడు పానీ మలి షకాషె? |
| Assamese | কালিলৈ বন্ধ নেকি?<br>కలలోయి బోంజో నెకి? | অলপ পানী পামনে?<br>అలోప్ పాని పామ్‌నె? |
| Malayalam | നാളെ അവധിയാണോ?<br>నాలె అవధియానొ? | എനിക്ക് കുറച്ച് വെള്ളം തരുമോ?<br>ఎనిక్కు కురచు వెల్లమ్ థరుమో? |
| Santali | [illegible]<br>గాపా డో జిరాహ్ మహా? | [illegible]<br>దాహ్ కాట్జి పె ఎమ్ దలెంజా? |
| Sanskrit | किम श्वाः अवकाशम अस्ति?<br>కిమ్ ష్వాః అవకాశమ్ అస్తి? | किम अहम किन्चित जलम प्राप्तुम शक्नोमि?<br>కిమ్ అహమ్ కించిత్ జలమ్ ప్రాప్తుమ్ శక్నోమి? |






| English | Shall we leave? | Today is my birthday. |
|---|---|---|
| Telugu | మనం వెళదామా? | ఈరోజు నా జన్మదినం. |
| Hindi | क्या मैं जा सकता हुं?<br>క్యా మైన్ జా సక్తా హూన్? | आज मेरा जन्मदिन है.<br>ఆజ్ మేరా జన్మదిన్ హై |
| Tamil | நாம் கிளம்பலாமா?<br>నామ్ కిలంబలామా? | இன்று எனக்குப் பிறந்தநாள்!<br>ఇండ్రు ఎనక్కు పిరంధా నాళ్ |
| Bengali | অমরা কি চলে যাব?<br>ఆమ్రా కి చోలె జాబో? | আজ আমার জোন্মোদিন ।<br>ఆజ్ అమార్ జన్మోదిన్ |
| Marathi | आम्ही निघु?<br>అమ్‌హి నిఘూ? | आज माझा वाढदिवस आहे.<br>ఆజ్ మాజా వాడదివస్ అహె. |
| Kannada | ನಾವು ಹೊರಡೋಣವೇ?<br>నావు హొరడోణవే? | ಇವತ್ತು ನನ್ನ ಜನ್ಮದಿನ.<br>ఇవత్తు నన్ను జన్మ దిన. |
| Oriya | ଆମେ ଏବେ ଯାଇପାରିବୁ କି?<br>అమె ఎబె జాఇపారిబు కి? | ଆଜି ମୋର ଜନ୍ମ ଦିନ<br>ఆజి మొర జన్మదిన. |
| Gujarati | અમે જઈએ?<br>అమె జయీా? | આજે મારો જન્મદિવસ છે.<br>అజే మరో జన్మదివస ఛే. |
| Assamese | আমি যাওনে?<br>అమి జోనె? | আজি মোৰ জন্মদিন।<br>అజి మర్ జన్మదిన్. |
| Malayalam | നമുക്ക് പോകാമോ?<br>నముక్కు పొకామో? | ഇന്ന് എന്റെ പിറന്നാളാണ്.<br>ఇన్ను ఎంటే పిరన్నాలను. |
| Santali | ᱥᱮᱱᱚᱜ ᱟᱞᱮ ᱥᱮ?<br>సెనోగ్ ఆలె సె? | ᱛᱮᱦᱮᱧ ᱫᱚ ᱤᱧᱟᱜ ᱡᱚᱱᱚᱢ ᱢᱟᱦᱟ।<br>టెహెన్జ్ దొ ఇన్జాగ్ జన్మ మాహా. |
| Sanskrit | किम अहम गन्तुम शक्नोमि?<br>కిమ్ అహమ్ గంతుమ్ శక్నోమి? | आद्य माम जन्मदिवसः अस्ति.<br>అధ్య మామ్ జన్మదివసః అస్తి. |

# యురేకా

## పేపర్ క్లాపర్

ఈ కాగితం బొమ్మను చేయడం చాలా సులభమే గాక చక్కటి వినోదాన్ని కూడా పొందవచ్చు.







ఏమేం కావాలి?

- ఎ4 కాగితం నుంచి చిన్న ముక్క.

తయారు చేయడం ఎలా?

- ఎ4 కాగితం నుంచి నాలుగోవంతు ముక్కను తీసుకోండి. కాగితం వెడల్పు భాగంలో కత్తిరించండి.
- కాగితం ముక్కను సగం మడిచి తెరచి ఉంచండి.
- మరోసారి కాగితం ముక్కను లోపలకు మడవండి. ముందు నలువైపులా చుక్కలు గీసి ఆ భాగాన్ని మడవండి.



- ఇలా మడిచిన దాన్ని తిరిగి సగం సైజుకు మడవండి.
- బొమ్మలో సూచించిన విధంగా చిన్న మడత పెట్టండి.
- కుందేలు పొడవాటి చెవుల ఆకారంలో మడత పెట్టండి. కాగితం లోపల చిన్న పర్వతంలాంటి మడత వచ్చేలా చేయండి. కాగితం మడతపై వేలితో చిన్న గాటు పెట్టండి. అప్పుడు ఈ మడత స్ప్రింగ్‌లా పనిచేస్తుంది. ఇప్పుడు క్లాపర్‌ని మీ బొటనవేలు, చూపుడు వేలుతో బొమ్మలో చూపిన విధంగా పట్టుకోండి. మీ బొటనవేలు, చూపుడు వేలును నొక్కి, వదిలిపెట్టడం ద్వారా కాగితం బొమ్మ చప్పట్లు కొడుతుంది.



**కాన్సెప్ట్:** పేపర్ క్లాపర్‌ని మూయడానికి మీరు బలాన్ని ఉపయోగిస్తారు. పేపర్ స్ప్రింగ్ బలాన్ని పునరుద్ధరించే విధి నిర్వర్తిస్తుంది.

*రచన: అరవింద గుప్తా (పూణెలోని ఇంటర్ - యూనివర్శిటీ సెంటర్ ఫర్ ఆస్ట్రానమీ అండ్ ఆస్ట్రో ఫిజిక్స్ భాగంలో విజిటింగ్ సైంటిస్టుగా పనిచేస్తున్నారు.)*

22

# ఆర్య

## మాణిక్య ద్వీప అన్వేషణ

చిత్రాలు: గాంధీ అయ్య

రాణి సుకన్యను కాపాడేందుకు మరీఘా రాజమందిరానికి వెళ్ళింది. ఆమెకు తాము అప్పగించిన పనులన్నింటినీ పూర్తి చేయగలదని సలూంకీ, ధార్విక్ భావిస్తారు. కాని వారు పొరపడ్డారు, తన తల్లి చంపబడిన రాత్రి జ్ఞాపకాలను మరీఘా మళ్లీ గుర్తుకు తెచ్చుకుంటుంది.

బొంతకాకిని వెదకుతూ మరీఘా శాంతిపురంలో తిరుగుతుంటుంది. ఒక రోజు -

బొంతకాకి ఇక్కడే ఉందని నాకు స్పష్టంగా తెలుస్తోం.

మరీఘా తలెత్తి పైకి చూసి సంబడపడింది. కొమ్మపై బొంతకాకి కూర్చుని ఉంది.

నీకెంత దూరమైపోయానో కదూ, ప్రియమైన క్లా, రా.. నావద్దకు రా..

బొంతకాకి ఆమె భుజంపై వాలింది. మెరుస్తున్న రాయి మాణిక్యం కింద పడింది.

ఓహ్.. క్లా.. దీన్ని ఇన్నాళ్లుగా నీ వద్దే ఉంచు కున్నావా?

అయ్యో ఆభాగ్యురాలు.. దాని పక్కనే పడి ఉన్న మెరుస్తున్న వస్తువేమిటి?

ఓహ్ .. మాణిక్యం! నాకు బహుమతి ఇస్తానని వాగ్దానం చేసిన జోయాకే దీన్ని ఇస్తాను.

మాణిక్యం చేతిలో పడ గానే మరీఘా వేగంగా తన గతాన్ని గుర్తు తెచ్చుకుంది.

క్లా కింద పడి ఉండటం మరీఘా మామయ్య రుస్తుం చూశాడు.

రుస్తుం బొంతకాకిని తనతో తీసుకెళ్లాడు పక్షి గాయాన్ని మాన్పి, మాణిక్యాన్ని దాని కడుపులో దాచాడు.




రుస్తుం బొంతకాకిని ఇవ్వగానే జోయా ముఖం వెలిగిపోయింది.

మాణిక్యం కోసం వెతుకుతున్నట్లు నటిస్తూ, జోయా మరోవైపు మరెక్‌తో యుద్ధం సాగించాడు. వందలాది ప్రజలు చంపబడ్డారు.

మరెక్‌లు ఓడించబడ్డారు కాని జోయా సంతోషంగా లేడు.











నేను ప్రతి విషయాన్ని ధర్మపితకు, ఆర్యకు ఇప్పుడే చెప్పేస్తాను.
మాణిక్యం శక్తితో ఆమె ధర్మపితకు జరిగిందంతా చెప్పేసింది.
ఎట్టకేలకు మంచి వార్త... మరీఘా మాణిక్యం కనిపెట్టింది!
ఎలా? ఎప్పుడు?
ధర్మపిత ఆర్యకు జరిగిందంతా చెప్పాడు.
నీవూ నాలాగే ఆలోచిస్తున్నావా?
ముందుగా రాజమంది రానికి వెళదాం పదండి.
ఈలోగా, సలూంకీ, థార్విక్ ఆగ్రహంతో కుతకుతలాడుతున్నారు.
మరీఘా, రాణిలపై దాడి చేద్దాం.
రాజ మందిరంలో, మరీఘాకు నిద్రపట్టడం లేదు.
నేనొక నీడను చూసినట్లు అనిపించింది...
థార్విక్ ముందుకు గెంతి మరీఘా వైపు కత్తి దూసి మాణిక్యాన్ని ఆమె నుంచి లాక్కున్నాడు.
ఇప్పుడు ఇది నాది.
దాన్ని నాకు ఇచ్చేయి...


నేను సంతోషంగా ఉన్నప్పుడు ఇస్తాను...
నీవు మూల్యం చెల్లిస్తావు!
ఆర్య, ధర్మపిత ఇద్దరూ గదిలో ప్రవేశించారు.
ఆర్య, మరీఘా వేగంగా ముందుకొచ్చారు, కాని తను ధార్విక్ వైపు కత్తిని దూశాడు.
హా.. హా..
అద్భుతం జరిగింది. ధార్విక్ చనిపోగానే ప్రభాత్ సజీవంగా లేచి నిలబడ్డాడు.
ఓహ్. ప్రభాత్!
మంత్రకట్టు ప్రభావంలో ఉండటం ఎంత తెలివిమాలిన పని.
సలూంకీ పరుగెత్తాడు కాని భటులు అతడిని పట్టుకున్నారు.
చక్కగా పట్టుకున్నారు! వెళ్దాం పదండి.
విజయం!
మరీఘా మాణిక్యాన్ని కలిగి ఉండగా వారి సైన్యాలు తీవ్రంగా పోరాడాయి, జోయా అతడి సైన్యం ఓడిపోయింది.
రాణి చక్కటి పసిపాపకు జన్మనిచ్చింది.
నా కూతురుకి మరీఘా అని పేరు పెడతా!
మంచి నిర్ణయం...
అది నాకు గౌరవం.
(అయిపోయింది.)

# మీకు బాగా సంతోషం కలిగించే చిన్నారి పాత్ర ఏది?





1. ఇష్టమైన కుడుములు కడుపారా భుజించి, ఎలుగ వాహనంపై ఆకాశంలో విహరించడానికి వెళ్లి కిందపడి తన దంతాన్ని విరగ్గొట్టుకున్నది ఎవరు?

2. సూర్యడిని కమ్మగా పండిన పండుగా భావించి దాన్ని తినాలని పట్టుకున్నది ఎవరు?



3. నీలి చర్మం కలిగి ఉండి, మట్టిని, వెన్నను రెంటినీ ఇష్టంగా తినే నీలి వర్ణపు సుందర బాలుడు ఎవరు?

4. స్వేచ్ఛా వర్తనుడై తండ్రికే సలహా ఇవ్వగల అసాధారణ జ్ఞానంతో, ఆత్మవిశ్వాసంతో తన కాళ్లమీద నిలబడిన బాలుడు.




సమాధానాలు:

1. వినాయకుడు
2. హనుమంతుడు
3. కృష్ణుడు
4. సుబ్రహ్మణ్య స్వామి

# భారత దర్శిని

## దీపావళి పండుగ సంబరాలు

దీపావళి పండుగను దేశంలోని వివిధ ప్రాంతాల్లో విభిన్న పద్ధతులలో జరుపుకుంటారు. వాటిలో కొన్ని:

శ్రీరాముడు పద్నాలుగేళ్ల వనవాసం ముగించి, రావణ సంహారం చేసి సీతాలక్ష్మణ సమేతంగా అయోధ్యకు తిరిగి వచ్చిన సందర్భంగా నగర ప్రజలు ఇంటింటా దీపాలు వెలిగించి శ్రీరాముడికి సాదర స్వాగతం పలికారు. అదే దీపావళి అయిందని రామాయణం చెబుతుంది.

ఉత్తర భారతదేశంలోని కొన్ని ప్రాంతాలలో దీపావళిని అయిదు రోజులు జరుపుకుంటారు. దీపావళి తొలి రోజును ధన్ తెరాజ్ అని పిలుస్తారు. ఆ రోజున దేవతల వైద్యుడు ధన్వంతరిని పూజిస్తారు. కొన్ని చోట్ల, ఈ రోజును ధన్ త్రయోదశి అని కూడా పిలుస్తారు. ఈ రోజున తమ ఇళ్లలో దీపాలు వెలిగించేవారు మరణభయం లేకుండా ఉంటారని నమ్మకం. కొందరు ఇల్లంతా చిన్న చిన్న దీపాలు వెలిగిస్తారు. వీటిని 'యమ దీపాలు' అని పిలుస్తారు.

పండుగ రెండో రోజున నరక చతుర్దశిని జరుపుకుంటారు. పురాణాల ప్రకారం నరకాసురుడిని కృష్ణుడు ఈ రోజునే హతమార్చాడు. కొంతమంది ఈ రోజును 'రూప చతుర్దశి' అని పిలుస్తారు.

మూడవ రోజు అమావాస్య. ఇది దీపావళి పండుగకు సంబంధించి ముఖ్యమైన దినం. ఆ రోజు లక్ష్మీదేవిని కొలుస్తారు. లక్ష్మీదేవికి స్వాగతం చెప్పడానికి ఇంటిని శుభ్రపర్చి అలంకరిస్తారు.

ఒకసారి కృష్ణుడు గోకుల వాసులను ఇంద్రపూజకు బదులుగా గోవర్ధనగిరిని కొలువమని సూచిస్తాడు. వర్షకారకుడైన ఇంద్రుడు కృష్ణుడి సలహా తెలిసి మండిపడి గోకులాన్ని ముంచెత్తాలని భారీ వర్షాలు కురిపిస్తాడు. బాల కృష్ణుడు గోవర్ధనగిరిని తన చిటికెన వేలుతో ఎత్తి గొడుగులాగా పట్టి గోపాలకులను కాపాడతాడు. అప్పటినుంచి గోవర్ధన గిరిని పూజించే ఆచారం ఏర్పడింది.

దీపావళి అయిదవరోజున భాయ్‌దూజ్ జరుపుకుంటారు. యమధర్మరాజు ఒకప్పుడు తన సోదరి ఇంటికి వెళ్లినప్పుడు ఆమె సంతోషంతో అతని నుదుట తిలకం దిద్ది నమస్కరించింది. యముడు ఆమెకు అపూర్వమైన కానుకలు ఇచ్చాడు. అన్నాచెల్లెళ్ల అనురాగం కలకాలం వర్ధిల్లింది. అందుకని ఈ రోజున అన్నలూ, తమ్ముళ్లూ, తమ అక్కాచెల్లెళ్ల ఇళ్లకు వెళ్లి కానుకలు ఇచ్చి ప్రేమానురాగాలను పరస్పరం పంచుకుంటారు.



తేడాలు కనుక్కోండి







## భిన్నమైనదాన్ని కనిపెట్టండి











## చందమామ రచయితల బృందంలో భాగం కండి!

మీలో చక్కటి సృజనాత్మక శక్తి ఉండి, రచన పట్ల ఆసక్తి ఉన్నట్లయితే, మీ ప్రతిభను ప్రదర్శించడం కోసం, మీకో చక్కటి వేదిక కల్పించడానికి మేం సిద్ధం. మీరు ఇంగ్లీషులో లేదా మేం ప్రచురిస్తున్న 12 భాషలలో స్వంత, చిన్న కథలు రాసి పంపించగలరు. ప్రాంతీయ అంశం కొట్టొచ్చినట్లు కనబడే మూల కథలను మేం ప్రోత్సహించగలము. మీ కథలు మా అవసరాలకు, మా ప్రమాణాలకు సరిపోయినట్లయితే మేం వెలువరిస్తున్న అన్ని భాషలలోనూ వాటిని ప్రచురించే విషయాన్ని తప్పక పరిశీలించగలరు. ఈ కథ మీ స్వంతమేనని నిర్ధారిస్తూ సంతకం చేసిన హామీ పత్రంతో పాటు మీ స్వంత రచనను(మాన్యుస్క్రిప్ట్) మాకు పంపగలరు. మీరు పంపదలచిన ఎన్వలప్‌పై మీ భాష, రచయిత పేరు, కథ శీర్షిక తప్పకుండా పొందుపర్చాలి.

మీ రచనలు పంపుతున్నట్లుగా ఈ-మెయిల్ (online@chandamama.com) ద్వారా కూడా మాకు సమాచారం పంపవచ్చు. అయితే మీ రచన, హామీ పత్రం మాత్రం ఆ వెంటనే పోస్టులో మాకు పంపాలి. ఒకసారి కథను పరిశీలించి ప్రచురణకు తీసుకున్న తర్వాత ఆ విషయం మీకు తెలుపుతాము. మీ కథ ప్రచురించబడిన తర్వాత, మీరు పంపిన మీ చిరునామాకు నగదు పురస్కారం పంపగలము. కథల ఎంపికలో సంపాదకులదే అంతిమ నిర్ణయమని గుర్తించగలరు.

మీ రచనలు పంపవలసిన చిరునామా:

To
Mr. Prashant Mulekar (Editor),
Chandamama India Ltd,
No.2, Ground Floor, Swathi Enclave,
Door No.5 & 6, Amman Koil Street,
Vadapalani, Chennai - 600 026

# రాయల వారి తప్పిదం

1



ఒకరోజు, కృష్ణదేవరాయలకు క్షురకర్మ చేయడానికి రాజ మంగలి ఆస్థానానికి వెళ్లినప్పుడు, రాజు నిద్ర పోతున్నాడు. రాజుకు నిద్రాభంగం కలగకుండా మంగలి మెత్తగా తన పని కానిచ్చేశాడు.

2



రాయల వారికి మెలకువ రాగానే, తనకు నిద్ర లోనే క్షురకర్మ చేసిన మంగలి నైపుణ్యం చూసి ఆనందించాడు. మంగలి ఏది కోరుకున్నా ఇస్తా నని చెప్పాడు.

3



''మహారాజా, చాలా కాలం నుండి మంత్రి కావాలని అనుకుంటున్నాను'' అని చెప్పాడు మంగలి. ''సరే నిన్ను మంత్రిని చేస్తాను'' అన్నాడు రాయలు.

4



ఆస్థానంలోని వారు ఈ విషయం విని ఆశ్చర్య పోయారు. చదువూ సంధ్యా లేని వాడు మంత్రిగా ఎలా పనిచేయగలడు అని వారు సందేహించి ఈ విషయంలో జోక్యం చేసుకోవలిసిందిగా తెనాలి రామలింగని కోరారు.

5



మరునాడు, కోటలోని కొలనులో తెనాలి రామ లింగడు చిన్న గోధుమరంగులో ఉన్న కుక్కకు స్నానంచేయిస్తూ ఉండటం చూసి రాయలు దిగ్భ్రాంతి చెందాడు. ''ఏమిటీ మతిమాలిన పని'' అంటూ రామలింగడిని ప్రశ్నించాడు.

6



''ఈ కుక్కను తెల్లగా మార్చాలనుకుంటున్నాను ప్రభూ,'' అని తెనాలి సమాధానమిస్తూ కుక్కను మరింత గట్టిగా తోమడం మొదలెట్టాడు.

# హాస్య చిత్రం



"వెర్రివాడా, గోధుమరంగు కుక్కను తెల్ల కుక్కగా చేయడం ఎక్కడైనా విన్నామా కన్నామా" అంటూ రాయలవారు ఆగ్రహించారు.



"చదువురాని మంగలి మంత్రిగా మారగలిగినప్పుడు గోధుమ రంగు కుక్క తెల్లగా ఎందుకు మారదు ప్రభూ" అంటూ రామలింగడు అమాయకంగా ప్రశ్నించాడు.



తాను తప్పు చేసినట్లుగా రాజుకు అప్పుడు తెలిసింది. మంగలిని మంత్రిగా చేస్తూ తానిచ్చిన ఉత్తరువును వెనక్కి తీసుకున్న రాజు మంగలికి పెద్ద బహుమతి ఇచ్చి పంపాడు.











CHANDAMAMA (Telugu) November 2010 Registrar of Newspapers of India No.1114/57. Regd No. TN/CH(C)/216/09-11
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/09-11, Foreign No. 85/09-11



# బుబ్బా జట్టు సాహసాలు




అర్లీన్, విజయ్, ఇర్ఫాన్, అఖిల్ విహారానికి వెళుతున్నారు.




మనం హోటల్‌కి వెళ్లి స్నానం చేసేదాకా నేను తాళలేను బాబూ.




విజయ్ మన విహారం ముగిసేంతవరకూ నిద్రలోనే ఉంటాడనిపిస్తోంది.




విజయ్... విజయ్.. లేవరా..




ఎలాగోలా వాళ్లు విజయ్‌ని లేపారు, అఖిల్ అతడి నోట్లో ఏదో పెట్టాడు.

విజయ్ చప్పరించాడు, ఉన్నట్లుండి నీరు ధారగా అతడి ముఖంపై పడి శుభ్రపర్చింది.




బస్సు ఆగీ ఆగగానే విజయ్ ఈతకొలను వైపు పరుగెత్తాడు.

అమ్మయ్య! ఎట్టకేలకు ప్రయాణం ముగిసింది.




అటు చూడండ్రా! విజయ్ బట్టలు కూడా విప్పకుండా స్విమ్మింగ్ పూల్‌లో దూకేశాడు!

రండి రండి. నీళ్లు ఎంచక్కా శుభ్రంగా ఉన్నాయి.




వాళ్లు ఒకరినొకరు చూసుకుని నవ్వుకున్నారు, తర్వాత కొలనులోకి దుమికారు.




వాళ్లలో నలుగురు చేతులు చరిచి అభినందించుకున్నారు.




